Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)
ఉపఎన్నికల ప్రత్యేక సంచిక
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 23 • 5-6-2012 మంగళవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-




# కేసుల ఊబిలో ఆశల సమాధి

జగన్ కేసులకు ముగింపు ఎట్లా? ఎక్కడ? అందరి మదిలో మెదులుతున్న ప్రశ్న ఇది. తాను జైలుకు వెళ్లక తప్పదన్న నిజం జగన్‌కు చాలాకాలం క్రితమే తెలుసు. అందువల్లనే సిబిఐ ఆయన్ను అరెస్టు చేసినప్పుడు పెద్దగా బాధ పడినట్లు, దిగ్భ్రాంతికి గురైనట్లు కన్పించలేదు. ఆయన కుటుంబ సభ్యులు కూడా తేలికగా తీసుకొన్నారు దాన్ని. దిల్‌కుషా గెస్ట్ హౌస్ ఎదుట విజయమ్మ చేపట్టిన నిరసన దీక్ష కూడా రాజకీయ పరమైనది మాత్రమే. మైసూరారెడ్డి మార్గదర్శకత్వంలో అరెస్టుపై జనంలో సానుభూతి పొందడానికి ఆమె ఆ దీక్ష చేపట్టారు. ఆ లక్ష్యం నెరవేరగానే విరమించారు. అయితే ఈ కేసుకు కూడా అరెస్టు శిక్ష కాదు. అదే సమాప్తం కాదు. అది ప్రారంభం మాత్రమే. ఎందుకైతే కేసు పెట్టారో, ఎందుకైతే అరెస్టు చేశారో ఆ నేరాన్ని రుజువు చేయాలి. అది చట్టవిరుద్ధమని నిరూపించాలి. అందుకు సాక్ష్యాలు కావాలి. న్యాయస్థానంలో వాద ప్రతివాదనలు జరగాలి. న్యాయమూర్తులను ఒప్పించాలి. ఆ తతంగం ముగియడానికి ఎంత లేదన్నా మూడు నాలుగేళ్ల సమయం పడుతుంది. అప్పటివరకు జగన్ నిందితుడే తప్ప నేరస్తుడు కాదు.

జగన్ నేరాలను రుజువు చేయడానికి తమ వద్ద తగిన ఆధారాలున్నాయని సిబిఐ న్యాయస్థానాలకు నివేదిస్తున్నది. గాలి జనార్దనరెడ్డి బెయిల్ విషయంలో జడ్జి పట్టాభిరామారావును సిబిఐ అధికారి లక్ష్మీనారాయణ వల వేసి పట్టుకొన్న తీరు చూసిన

కొరవ 14వ పేజీలో

# ధన మదం

తన బెయిల్ కోసం 60 కోట్ల రూపాయలు ఖర్చు చేయడానికి మైనింగ్ మాఫియా రారాజు గాలి జనార్ధనరెడ్డి చేసిన విఫల ప్రయత్నం దేశంలో నానాటికీ ప్రబలుతున్న ధన మదాన్ని కళ్లకు కట్టింది. డబ్బుతో ఆయన ఇప్పటి వరకు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి, జగన్ వంటి రాజకీయ వాదులను టోకున కొనుగోలు చేశాడు. ప్రభుత్వ భూములు, గనులు ఇష్టారాజ్యంగా స్వంతం చేసుకొన్నాడు. అధికారులను చిల్లర సరకు వలె కొనుక్కొన్నాడు. అక్రమ గని త్రవ్వకాలతో అపర కుబేరుడిగా ఎదిగాడు. ఎన్నో తప్పులను ఒప్పులుగా మార్చుకొన్నాడు. ఎమ్మెల్యేలను కొన్నాడు. కర్నాటకలో ప్రభుత్వాన్ని కోతి బొమ్మ వలె ఆడించాడు. చట్టాలను తన కాలి క్రింద చెప్పు వలె తొక్కి పెట్టాడు. విశృంఖల వీరవిహారం చేశాడు. ఇప్పుడు ఏకంగా న్యాయస్థానాలకే డబ్బు ఎర వేశాడు. సిబిఐ కోర్టు జడ్జి పట్టాభిరామారావు ఆయన వలలో పడ్డాడు. కట్టలు కట్టలుగా కరెన్సీ కాగితాలు కళ్ల ముందు కదలాడే సరికి నిగ్రహం కోల్పోక తప్పలేదు.

న్యాయస్థానాలలో అవినీతి మనకు కొత్తేమీ కాదు. క్రింది స్థాయి మెజిస్ట్రేట్ కోర్టుల నుంచి అత్యున్నత స్థాయిలోని సుప్రీంకోర్టు వరకు ఎందరో న్యాయమూర్తులు డబ్బుకు దాసోహమన్న సంఘటనలు కోకొల్లలుగా వున్నాయి. గత 17 మంది సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తులలో 16 మంది ఏదో ఒక రకమైన అవినీతికి పాల్పడిన వారే అని ప్రకటించాడు సీనియర్ న్యాయవాది ప్రశాంత భూషణ్. దానిపై ఆయన్ను కోర్టు ధిక్కార నేరం క్రింద బోనులో నిలబెట్టినా తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు. దిగువస్థాయి కోర్టులలో న్యాయమూర్తులు లంచాలు మేయడం సర్వసాధారణం. ఇటీవలనే విశాఖపట్నంలో ఇద్దరు జిల్లా జడ్జిలకు అవినీతి ఆరోపణలతో ఉద్వాసన పలికింది మన హైకోర్టు.

జమీన్‌రైతు

అయితే దేశ ఆర్థిక రంగ పునాదులను పెకలించే స్థాయిలో నేర సామ్రాజ్యాన్ని విస్తరించిన గాలి జనార్ధనరెడ్డి వంటి భయంకర ఆర్థిక నేరస్తుడి విషయంలో సిబిఐ కోర్టు న్యాయమూర్తి అంత బరితెగింపుగా వ్యవహరించడం మాత్రం దేశాన్ని దిగ్భ్రాంత పరచింది. న్యాయ వ్యవస్థ ఏ పాతాళానికి పతనమై పోతుందా అన్న ఆవేదన రగిల్చింది. సాధారణ భూ తగాదాలలో న్యాయమూర్తులు కక్కుర్తిపడితే దానివల్ల సమాజానికి జరిగే నష్టం పరిమితం. కానీ గాలి జనార్ధనరెడ్డి కేసు అట్లా సాధారణ కోవకు చెందింది కాదు. ఆయన వల్ల ప్రకృతి విధ్వంసం జరిగింది. ప్రభుత్వ చట్టాల హననం జరిగింది. విలువైన ప్రజల ఆస్తి దోపిడీకి గురైంది. రెండు రాష్ట్రాలలో రాజకీయ వ్యవస్థ హీనస్థితికి దిగజారింది. దీనిపై దేశమంతా అలజడి రేగింది. సుప్రీంకోర్టు దీన్ని చాలా తీవ్రస్థాయి నేరంగా పరిగణించింది. సుప్రీంకోర్టు సాధికారిక సమితులు నివేదికలిచ్చాయి. సిబిఐ అధికారులు అహోరాత్రులు శ్రమపడి బలమైన సాక్ష్యాలు సేకరించారు. అందుకు కొన్ని వందల కోట్ల రూపాయల ప్రజాధనం వెచ్చించడం జరిగింది. యావత్ దేశ ప్రజలు ఈ కేసును ఆసక్తిగా తిలకిస్తున్నారు. జాతి ద్రోహులకు ఎటువంటి శిక్ష పడుతుందో అన్న ఆతృతతో ఎదురు చూస్తు న్నారు. ఆ శిక్ష భవిష్యత్తులో ఇటువంటి మాఫియా సామ్రాజ్యాల ఉనికి లేకుండా రూపుమాపేదిగా వుండాలని కోరుకొంటున్నారు. అంత కీలకమైన న్యాయస్థానంలో వుంటూ, జడ్జి పట్టాభిరామారావు గాలానికి చేప పిల్ల వలె నేరస్తుల ప్రలోభానికి చిక్కిపోవడం, జాతి ద్రోహానికి తెగబడడం కడుపు మండించే విషయం.

ఎన్ని ఆరోపణలున్నా, ఎంత అసమర్థంగా పనిచేస్తున్నా మన దేశంలో న్యాయవ్యవస్థకు ఎంతో కొంత విశ్వసనీయత వుంది. రాజకీయ, అధికార యంత్రాంగాల పతనం నుంచి ఉపశమనం కావాలనుకొన్నప్పుడు ప్రజలు కోర్టులనే ఆశ్రయిస్తున్నారు. ఆ న్యాయ పీఠాలలో తమకు న్యాయం దొరుకుతుందన్న నమ్మకం చూపుతున్నారు. పట్టాభిరామారావు వంటి న్యాయమూర్తులు ఆ నమ్మకాన్ని వమ్ము చేస్తున్నారు. ఇటువంటి న్యాయ ద్రోహులను చాలా కఠినంగా శిక్షించవలసిన అవసరం వుంది.

ఇదే సమయంలో గాలి బెయిల్ బేరాన్ని నికరమైన సాక్ష్యాలతో సిబిఐ వెలికి తీసిన తీరు మాత్రం ప్రజలందరికీ సంతోషం కల్గిస్తున్నది. సిబిఐ జాయింట్ డైరెక్టర్ లక్ష్మీనారాయణ ఒక హీరోగా ప్రజల మన్ననలు అందుకొంటున్నాడు. ఈ విషయంలో ఆయన పని తీరు సినిమా తరహాలో వుంది. ఒక వ్యక్తి చిత్తశుద్ధితో పని చేస్తే నేరస్తుల ఆటలు ఎంతగా కట్టడి చేయవచ్చో నిరూపించి చూపారాయన. అటువంటి అధికారులు మనకింకా మిగిలి వున్నందుకు ఎంతో సంతోషం కల్గుతున్నది. ప్రభుత్వ ఉద్యోగాలు చేసే అధికారులందరూ ఆయన నుంచి స్ఫూర్తి పొందగల్గితే దేశం ఎంత బాగుపడుతుందో కదా?

## జనవాణి

### ఏమిటీ పరిష్కారం?

భారతదేశంలో విడాకులు నానాటికీ పెరిగిపోతున్నాయి. కొన్ని నెలలైనా కాపురం చేయకుండానే ఒకరినొకరు అర్థం చేసుకోకుండా చిన్న చిన్న అపార్థాలతో, అభిప్రాయభేదాలతో అనవసరమైన వివాదాలతో విడాకుల కోసం న్యాయవాదుల వద్దకు, న్యాయస్థానాలకు పరుగెత్తుతున్నారు. విడాకులు సునాయాసంగా పొందుతున్నారు. కొంతమంది న్యాయవాదులు వారిని కలపటానికి, వివాదాలు తగ్గించడానికి కృషి చెయ్యకుండా ధనాశతో విడాకులు ఇప్పిస్తున్నారు. న్యాయస్థానాలు కూడా మనస్ఫూర్తిగా కౌన్సిలింగ్, ఇతర విధానాలతో దంపతులను దగ్గర చెయ్యటానికి ప్రయత్నించడం లేదు. 2011 సంవత్సరంలో 3వేల మంది విడాకులు పొందారు. ఈ సమస్య తీవ్రత గుర్తించి విడాకులు ఆపడానికి ప్రయత్నించాలి.

ఎం.కామాక్షి — గూడూరు

### ఎన్నికలు ఓ ఫార్సు!

ఎన్నికలలో అన్ని పార్టీలు గెలుపు గుర్రాలనే అభ్యర్థులుగా ఎంపిక చేస్తున్నాయి. ధనం ఖర్చు పెట్టలేనివాడు ఎన్నికల్లో గెలవడం కష్టమౌతోంది. ధనంతోపాటు మద్యం ఏరులై పారుతోంది. ఎన్నికల సంఘం ఎన్ని హెచ్చరికలు జారీ చేసినా నిష్ప్రయోజనమవుతున్నది. దీనికి ఉదాహరణ వాహనాల తనిఖీలో పట్టుపడుతున్న నోట్ల కట్టలు. డబ్బు ఖర్చు పెట్టి ఎన్నికల్లో గెలిచిన నేతలు ఎన్నికల తర్వాత జనానికి కనిపించరు. దేశంలో ఎన్నికలు ఓ ఫార్సుగా మారాయి.

కెవి.సత్యం — నెల్లూరు

### బంగారంతో సమస్యలు

బంగారం అంటే ఇష్టపడని వారుండరు. అందువల్లే అతివలు ఎంతో కష్టపడి బంగారు కొంటుంటారు. ఈ రోజుల్లో బంగారు నగలు ధరించి తిరగను పరిస్థితులు అనుకూలించడం లేదు. నెల్లూరు బాలాజీనగర్ అడ్డవీధుల్లో ప్రతి రోజూ చైన్ స్నాచింగ్‌లు జరుగుతూనే వున్నాయి. దొంగలను పట్టుకోవడంలో నెల్లూరు పోలీసులు తెగువ చూపడం లేదు. ఒకవేళ ఒకరిద్దరు దొంగలను పట్టుకొన్నా వారికి కఠిన శిక్షలు లేకపోవడం వల్ల మళ్లీ దొంగతనాలకు దిగుతున్నారు.

పి.అరుణకుమారి — నెల్లూరు

### ముస్లింలకు మరోసారి మోసం!

స్వాతంత్ర్యం సిద్ధించినప్పటి నుంచి ముస్లింలను అధికారంలో వుండిన కాంగ్రెస్ పార్టీ మోసం చేస్తోంది. రాష్ట్రంలో ముస్లింలు ఎక్కువ శాతం మంది దైన్యస్థితిలో వున్నారు. వీరికి ప్రభుత్వ విద్య, ఉద్యోగ రంగాల్లో 4.5శాతం రిజర్వే

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

12-6-1942
పేజీలు : 8 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

ఉత్తర ఖండం పేష్కారు కుమారుడికి 5వ తేదీ ఉపనయనమైందనీ, 5వేలు దాకా చదివింపులు వచ్చాయనీ, 5వతేదీ రాలేనివారు 6తేదీ గూడా చదివింపులతో వచ్చారనీ వార్త. చదివింపులు, లంచాల క్రిందకు రావని అలహాబాదు కాంగ్రెసు తీర్పు.

* * *

నార్తుమోపూరులో ఈమధ్య మాలలు కొందరు నురిసిన ధాన్యం అపహరించగా పల్లెటూరి మర్యాద ప్రకారం వారిని కొట్టారనీ మాలలంతా కట్టుగావచ్చి ఆనాడు పేరయ్యకు జరిపిన మర్యాద ఈనాడు వెంకయ్య కుటుంబానికి జరిపారని వార్త. మేం ఇదివరకు జోస్యం చెప్పినట్లే జరిగింది. ఇప్పటికైనా ఎవరైనా తప్పు జేసి వుంటే చెంపలు వేసుకొని రౌడీలకు అనువివ్వకుందురు గాక.

* * *

సర్కిల్ ఇన్స్‌పెక్టరుగారూ! బృందావనంలో మీయింటి ప్రక్కన స్త్రీలు స్నానం చేస్తుంటే ఎవడో కొంటె కుర్రవాడు మీ మిద్దె మీద నుండి చూస్తున్నాడట, విచారించి గూబలు వాయించండి.

* * *

ముత్తుకూరు నుంచి వచ్చే ప్రతి బస్సు ఎస్ఐ వల్ల అరగంట ఆలస్యమంటుంటారే ఎందువల్లా?

### నెల్లూరు వార్తలు

నెల్లూరు కుమ్మరివీధి నుండి గలాటాల్లో లేచిపోయిన హిందువుల్లో 12 కాపురాలవార్ని మొన్న 8వతేది నెల్లూరు హిందూ మహాసభవారు మరల చేర్పించారు. అబ్బా! ఎన్నాళ్ల కెన్నాళ్లకు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

8-6-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### కాంగ్రెస్ అధ్యక్షత

అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్ష పదవి ఆంధ్రుని నుంచి ఆంధ్రునికే సంక్రమించింది. నీలం సంజీవరెడ్డి గారి స్థానంలో దామోదరం సంజీవయ్యగారు కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడినారు. ఇది అపూర్వమైన సంఘటన. కాంగ్రెస్ డెబ్బై ఏడేండ్ల చరిత్రలో ఇలాంటివి జరుగలేదు. అదృష్టపు పరుగులో సంజీవరెడ్డి, సంజీవయ్యగారలు పోటీ పడుతున్నారు. ఇందులో ఒకరు ముందు, ఒకరు వెనుక – అంతే తేడా.

సంజీవరెడ్డిగారి ముఖ్యమంత్రిత్వంలో తనమాట నెగ్గించుకోలేకపోయిన సంజీవయ్య, ముఖ్యమంత్రులందరి మీద పెత్తనం వహించగల కాంగ్రెస్ అధ్యక్షతను పొందడం అదృష్టదేవత అభిమాన చేష్ట తప్ప మరేమవుతుంది? అదృష్టముండే వ్యక్తి ఎప్పుడూ అడుగునపడదు. సంజీవయ్య నిజంగా అదృష్టవంతుడు. అతని జీవితం ధన్యం. వారికి మా హృదయపూర్వక అభినందనలు.

### నెల్లూరు ముచ్చట్లు

#### దోమల బాధ మునిసిపాలిటీ నిర్లక్ష్యం

నెల్లూరులో దోమల బాధ దుర్భరమైపోయింది. మున్నెన్నడూ యింత విపరీతంగా లేదు. పౌరులు సుఖనిద్రకు నోచుకొని ఎన్నిరోజులైనదో! ప్రజల రక్తాన్ని జలగలవలె పీల్చుతూ, పిప్పి జేస్తున్నది.

దీని విముక్తికి మునిసిపాలిటీ ఏమి చర్యలు తీసుకున్నారో తెలియదు. వి.డబ్ల్యు.డి వాళ్లు కాల్వలకు నీరు వదలకుంటే మమ్ములను ఏమి చేయమంటారంటారేమో, మునిసిపాలిటీ వారు! పట్టణ పారిశుద్ధ్యమునకు బాధ్యత వహించవలసిన మునిసిపాలిటీ ఈ సమాధానం చెప్తే సరిపోదు.

# నెల్లూరు ముచ్చట్లు

## పార్లమెంట్ బరిలో 13 మంది!

నెల్లూరు పార్లమెంటు బరిలో 13 మంది మిగిలారు. కాంగ్రెస్ పార్టీ తరపున తిక్కవరపు సుబ్బరామిరెడ్డి, తెలుగుదేశం పార్టీ తరపున వంటేరు వేణుగోపాల్‌రెడ్డి, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ తరపున మేకపాటి రాజమోహన్‌రెడ్డి, సిపిఎం తరపున చంద్ర రాజగోపాల్ పోటీ చేస్తున్నారు. వీరుగాక నిండికంటి రాజశేఖర్ (రిపబ్లికన్ పార్టీ), షేక్ ముజబుర్ రెహ్మాన్(పిరమిడ్ పార్టీ) తరపున బరిలో ఉన్నారు. ఇండిపెండెంట్లుగా కొంగలేటి జయకుమార్ మిత్రా, చింతల చిరంజీవి, జెట్టి వేణు, పల్లాల ధనుంజయ, పొత్తూరి తులసీదాస్, మండవ వెంకట్రావు, మేడా మల్లారెడ్డి పోటీ చేస్తున్నారు. మొత్తం మీద 19 మంది నామినేషన్లు దాఖలు చేయగా వివిధ కారణాల వల్ల ఆరు మంది నామినేషన్లు తిరస్కరించారు.

## పదమూడున్నర లక్షల మంది ఓటర్లు!

నెల్లూరు పార్లమెంటు నియోజకవర్గంలో కొత్తగా చేర్చిన ఓటర్లతో కలిపితే 13,51,269 మంది ఓటర్లు ఉన్నట్లు కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ప్రకటించారు. కందుకూరులో 1,82,506 మంది, కావలిలో 1,96,501 మంది, ఆత్మకూరులో 1,82,726 మంది, కోవూరులో 2,17,044 మంది, నెల్లూరు సిటీ నియోజకవర్గంలో 1,79,141 మంది, నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో 1,97,388 మంది, ఉదయగిరిలో 1,95,963 మంది ఓటర్లున్నారు. గతంలో కన్నా 35,820 మంది అదనంగా నమోదయ్యారు.

## టిఎస్ఆర్ ప్రచారానికి మహామహులు!

నెల్లూరు పార్లమెంటు స్థానం నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేస్తున్న తిక్కవరపు సుబ్బరామిరెడ్డికి మద్దతుగా ప్రచారం చేయను మహామహులు రెండవసారి నెల్లూరుకు వచ్చారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, పిసిసి చీఫ్ బొత్సా సత్యనారాయణ, రాజ్యసభ సభ్యుడు మెగాస్టార్ చిరంజీవి 3వ తేది మినీ బైపాసురోడ్డులో ఏర్పాటుచేసిన సభలో మాట్లాడారు. వీరితోపాటు రాష్ట్ర కాంగ్రెస్ వ్యవహారాల ఇన్‌ఛార్జ్ గులాం నబీ ఆజాద్ కూడా ఈ సభకు హాజరయ్యారు.

## మూడుసార్లు వచ్చిన చంద్రబాబు!

తెలుగుదేశం పార్టీ సర్వాధినేత చంద్రబాబు తమ పార్టీ అభ్యర్థి వంటేరు వేణుగోపాల్‌రెడ్డికి మద్దతుగా ప్రచారం చేయను మే నెలలో మూడుసార్లు నెల్లూరుకు వచ్చారు. నెల్లూరు సిటీ, నెల్లూరు రూరల్ నియోజకవర్గాల్లో ఆయన ప్రచారానికి పెద్ద స్పందన లేకపోయినా కావలి, ఉదయగిరి నియోజకవర్గాల్లో చంద్రబాబు రోడ్‌షోలకు జనం పొంగిపొర్లారు.

## విజయమ్మ రాక!

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థుల కోసం ప్రచారం చేయను వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ గౌరవాధ్యక్షురాలు వైఎస్ విజయమ్మ 4తేదీ నెల్లూరుకు వచ్చారు. ఆమెతోపాటు షర్మిళమ్మ కూడా ప్రచారంలో పాలుపంచుకొన్నారు. ఉదయగిరి, వింజమూరు రోడ్ షోలు బ్రహ్మాండంగా జరిగాయి.

## ఎండలకు రాలిపోతున్నారు!

భానుడి భగభగలను జనం తట్టుకోలేక పోతున్నారు. 45 సెంటీగ్రేడు డిగ్రీల ఎండ భరించలేక వయస్సు మళ్లిన వారు నిశ్శబ్దంగా ప్రాణాలు వదిలేస్తున్నారు. మే 31వ తేది బోడిగాడితోట స్మశానవాటికలో 16 మందికి దహన సంస్కారాలు జరిగాయి. ఈ లెక్కన ముస్లిం, క్రిస్టియన్ల సమాధుల తోటలను బేరీజు వేస్తే రోజుకు 30 మంది హరీమంటున్నారు. దేవుడు దయ తలిస్తేగానీ ఎండలు తగ్గేట్లు లేవు.

## బంద్‌ను విఫలం చేసిన పోలీసులు!

పెట్రోల్ ధరల పెంపకాన్ని నిరసిస్తూ 31వ తేది ప్రతిపక్షాలు చేసిన భారత్ బంద్‌ను నెల్లూరులో పోలీసులు భగ్నంచేశారు. తెలుగుదేశం, బిజెపి, సిపిఎం నేతలు నిరసన తెలియజేయను వీధుల్లోకి రాగానే వారిని అదుపులోనికి తీసుకొన్న పోలీసులు సమీప పోలీస్ స్టేషన్లకు తరలించారు. పోలీసులకు పెట్రోల్, డీజిల్ ఖర్చులుండవు. స్టేషన్‌కు వచ్చేవారి దగ్గర 'వసూల్ రాజాలై' బండ్ల ట్యాంకులు నింపుకొంటారు. జనం నిరసన తెలియజేయను ముందుకొస్తే అరెస్ట్ చేస్తే ఎలా ఎస్పీ గారు?



ప్రతిష్టాత్మకమైన నాసా ప్రైజ్‌లను గెలుచుకొన్న రవీంద్రభారతి స్కూల్ విద్యార్థులను అభినందిస్తున్న ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డితో విద్యాసంస్థల ఛైర్మన్ ఎం.ఎస్.మణి.

## అమ్మో చికెన్!

ఆదివారం పూట కూడా చికెన్ కొని తినలేని దౌర్భాగ్య రోజులు దాపురించాయి. సామాన్యులకు అందుబాటులో ఉండే చికెన్ కిలో ఆల్‌టైం రికార్డు ధర 170 రూపాయలకు చేరుకొంది. కోడిగుడ్లు డజను 40 రూపాయలుగా అమ్ముతున్నారు. కూరగాయలతో పాటు మటన్, చేపల రేట్లు బాగా పెరిగిపోయాయి.

## సమస్యలు చెబితే మంత్రి అసహనం!

ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డికి ఎన్నికల ప్రచారంలో వింత అనుభవం ఎదురయ్యింది. అనంతసాగరం మండలం శంకరనగరం, పాత దేవరాయపల్లి, మంచాలపల్లి గ్రామాలకు వెళ్లగా జనం తాగునీటి సమస్య, ప్రత్యేక విద్యుత్ లైను గూర్చి నిలదీయడంతో మంత్రి గారికి కోపమొచ్చింది. కాసేపటికి సర్దుకొని ఎన్నికలయ్యాక సమస్యలను పరిష్కరిస్తానని చెప్పి తప్పించుకొని వచ్చారు.

## అక్కడ కూడా లంచం...

వ్యవస్థను లంచాలు తూట్లు పొడుస్తున్నాయి. ఇక్కడా, అక్కడా అన్న తేడా లేకుండా ప్రతిచోట లంచాలు తీసుకొంటూనే ఉన్నారు. బోడిగాడితోటలోని రుద్రభూమిలో మునిసిపాలిటీ తరపున మరణ పత్రాన్ని నమోదుచేసే ఉద్యోగి తన తరపున పెట్టిన మైనార్టీ యువకుని చేత వివరాల నమోదుకు శవం తాలుకు వ్యక్తులను బట్టి వసూళ్లు చేస్తున్నారు. కాష్టంలో ఈ వసూళ్లు ఏమిటి కమిషనర్ గారు...

కొరవ 14వ పేజీలో

# జగన్‌కు ఓటువేస్తే ప్రమాదం


విలేకరులతో మాట్లాడుతున్న రేణుకాచౌదరి.

జగన్‌పై సానుభూతితోనో, భావోద్వేగానికి గురై ఓటు వేస్తే భవిష్యత్ అంధకారమవుతుందని కాంగ్రెస్ నేత, రాజ్యసభ సభ్యురాలు రేణుకా చౌదరి ఓటర్లకు విజ్ఞప్తి చేశారు. కాంగ్రెస్ పార్టీ తరపున ప్రచారం నిర్వహించేందుకు నెల్లూరు వచ్చిన ఆమె విలేకరులతో మాట్లాడారు. జగన్ చేసిన నిర్వాకాల వల్లనే జైలు పాలయ్యారని విమర్శించారు. ఆయనపై సానుభూతి చూపినా, సమర్థించినా అవినీతిని సమర్థించినట్లౌతుందన్నారు. ఇది ఎంతవరకు సబబు అని ప్రశ్నించారు. వైఎస్ సతీమణి విజయమ్మ కల్లబొల్లి మాటలు మాట్లాడుతున్నదని విమర్శించారు. అసత్యాలను, అబద్ధాలను ప్రచారం చేస్తున్నారని చెప్పారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మరణించి రెండు సంవత్సరాలు గడుస్తుంటే ఇప్పుడు ఆయన మృతిపై అనుమానాలు వ్యక్తం చేయడం విచారకరం అన్నారు. కాంగ్రెస్ అధినేత్రి సోనియా గాంధీని విజయమ్మ విమర్శించడాన్ని తీవ్రంగా ఖండించారు. రెండుసార్లు ప్రధాని పదవిని త్యాగం చేసిన త్యాగమూర్తి సోనియాగాంధీ అని కీర్తించారు. రాజీవ్ గాంధీని హత్యచేసిన నళినికి క్షమాభిక్ష ప్రసాదించిన క్షమాగుణం కల్గిన వ్యక్తిని కొనియాడారు. న్యాయస్థానాలకు అనుగుణంగా, వాటి ఆదేశాల ప్రకారం సిబిఐ పనిచేస్తుంది తప్ప కాంగ్రెస్ ప్రభుత్వ ఆదేశాలపై పనిచేయదని స్పష్టం చేశారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కుటుంబం పట్ల కాంగ్రెస్ పార్టీ ఎంతో గౌరవం చూపిందని, ఆయన్ను రెండు సార్లు ముఖ్యమంత్రిని చేసిందని గుర్తు చేశారు. నెల్లూరు పార్లమెంటు స్థానం నుంచి పోటీచేస్తున్న కాంగ్రెస్ అభ్యర్థి టి.సుబ్బరామిరెడ్డి దైవబలం, గుండె బలం గల నాయకుడని అలాంటి వ్యక్తిని గెలిపించాలని కోరారు.

## ధాన్యం కొనుగోళ్లపై శిక్షణ

వచ్చే సంవత్సరం నుంచి ధాన్యం కొనుగోలు చేసే విధానంపై జిల్లాలోని స్వయం సహాయక సంఘాలకు శిక్షణ కార్యక్రమాలు ఏర్పాటు చేయనున్నట్లు జిల్లా జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ తెలిపారు. నగరంలోని సంఘ రక్ష కార్యాలయంలో పొదుపు గ్రూపు మహిళలతో సమావేశం జరిగింది. ఈ సమావేశానికి హాజరైన జాయింట్ కలెక్టర్ మాట్లాడుతూ ధాన్యం కొనుగోళ్లకు సంబంధించిన ఎటువంటి ఇబ్బందులు తలెత్తకుండా అన్ని చర్యలు తీసుకోవడం జరుగుతుందన్నారు. కొనుగోలు కేంద్రాల్లో పూర్తిస్థాయిలో గోతాలు అందుబాటులో ఉంచేందుకు చర్యలు తీసుకొంటామని హామీ ఇచ్చారు. ధాన్యం తూకం వేసే యంత్రాలు ఏర్పాటుచేసి పూర్తి సమాచారాన్ని కంప్యూటర్‌లో పొందు పరుస్తామని చెప్పారు.


జనంతో మమేకమై వారి సమస్యలు అడిగి తెలుసుకొంటున్న మేకపాటి గౌతమ్‌రెడ్డి.

## మేకపాటి సోదరుల గెలుపుతో మలుపు!

రానున్న రోజుల్లో జిల్లా అభివృద్ధికి మేకపాటి సోదరులే కీలకం కానున్నారని వైకాపా నేత మేకపాటి గౌతంరెడ్డి అభిప్రాయపడ్డారు. పార్టీ నేతలు, కార్యకర్తలతో ఆయన మాట్లాడుతూ ఈ ఎన్నికల్లో మేకపాటి రాజమోహన్‌రెడ్డి, చంద్రశేఖర్‌రెడ్డిని గెలిపించుకోవడం వలన జిల్లా అభివృద్ధితోపాటు మెట్టప్రాంత అభివృద్ధికి వీలు కల్గుతుందన్నారు. వైఎస్ ఆశయాలు నెరవేరాలన్నా, రాష్ట్ర అభివృద్ధి జరగాలన్నా వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ముఖ్యమంత్రి కావాల్సిన అవసరం ఎంతైనా ఉందన్నారు. ఆయన అధికారంలోకి వస్తే రాష్ట్రంలో అభివృద్ధి జరగడంతోపాటు జిల్లాను అభివృద్ధి చేసుకోవచ్చన్నారు. మెట్ట ప్రాంతమైన ఉదయగిరి అభివృద్ధి మేకపాటి సోదరుల వల్లే జరిగిందన్న సంగతి ప్రజలందరికీ తెలుసన్నారు. ఎన్నికలు వచ్చినప్పుడల్లా కొత్త వారు వస్తుంటారు, పోతుంటారని వీరి వల్ల ఒరిగేదేమీ లేదన్నారు. ఉదయగిరి ప్రాంతంలో విద్యాభివృద్ధికి కృషిచేసిన ఘనత రాజమోహన్‌రెడ్డిదేనన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి జిల్లాను సస్యశ్యామలం చేసేందుకు, పలురకాల పనులకు కోట్లాది రూపాయలు మంజూరు చేశారన్నారు. ఆయన మరణంతో ఆ పనులన్నీ ఆగి పోయాయన్నారు. ఉదయగిరికి కీలకమైన సీతారాంసాగర్ ప్రాజెక్టు పనులు ప్రారంభం కాలేదన్నారు. ఈ పథకాలన్నీ తిరిగి ప్రారంభం కావాలంటే ఫ్యాన్ గుర్తుకు ఓటువేసి అభ్యర్థులను భారీ మెజారిటీతో గెలిపించాలని కోరారు.

# జగన్ అరెస్టుతో కాంగ్రెస్, టిడిపి డిపాజిట్లు గల్లంతు!

### నెల్లూరు పెద్దబజార్, చిన్నబజార్ ప్రాంతాల ప్రచారంలో వైకాపా మైనార్టీనేత అబ్దుల్ అజీజ్ వెల్లడి.


ఆత్మకూరు ప్రచారంలో అబ్దుల్ అజీజ్, ఆయన సోదరుడు జలీల్.

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధినేత వైఎస్.జగన్మోహన్‌రెడ్డిని ఎన్నికల ప్రచారానికి దూరం చేయాలన్న దుర్బుద్ధితో ఆయన్ను అరెస్టు చేయించిన కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు ఉప ఎన్నికలు జరుగుతున్న అన్ని నియోజకవర్గాల్లో డిపాజిట్లు కూడా దక్కవని వైఎస్ఆర్ కాంగ్రెస్ మైనార్టీ నేత హాజీఅబ్దుల్ అజీజ్ జోస్యం చెప్పారు. నెల్లూరు నగరంలోని బారకాస్, జెండావీధి, పెద్దబజార్, చిన్నబజార్ ప్రాంతాల్లో వైఎస్ఆర్‌సిపి నెల్లూరు పార్లమెంట్ అభ్యర్థి మేకపాటి రాజమోహన్‌రెడ్డిని గెలిపించాలని కోరుతూ హాజీ అబ్దుల్ అజీజ్ బృందం చేసిన పాదయాత్రకు మంచి స్పందన లభించింది.

### జగన్‌కు ప్రజాభిమానం పెరిగింది!

ఈ సందర్భంగా హాజీ అబ్దుల్ అజీజ్ మాట్లాడుతూ బంతిని ఎంత కసిగా గోడకు కొడితే అంతే వేగంతో తిరిగొస్తుందని, అదే విధంగా కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు వైఎస్ఆర్‌సిపి అధ్యక్షుడు జగన్మోహన్‌రెడ్డిని పలురకాలుగా అణచి వేయాలని చూస్తుంటే మరింతగా ప్రజాభిమానం పెరుగుతుందన్నారు. దీనికి నిదర్శనమే వైఎస్‌విజయమ్మ, షర్మిలమ్మ సభలకు స్వచ్ఛందంగా తరలివస్తున్న జనమన్నారు. మహిళలు, యువకులు, రైతులు, వైఎస్.విజయమ్మ పర్యటనలో పాల్గొని తమ పార్టీకి సంఘీభావం తెలుపుతున్న తీరు చూస్తే కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు డిపాజిట్లు గల్లంతు కావడం ఖాయమనిపిస్తుందన్నారు.

### వైఎస్‌ను ముస్లింలు మరవరు!

ముస్లిం మైనార్టీలకు స్వర్గీయ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి చేసిన సహాయాన్ని ముస్లింలు ఎట్టి పరిస్థితుల్లో మర్చిపోరని, ఆయన ప్రవేశపెట్టిన ఆరోగ్యశ్రీ, ఫీజు రీయింబర్స్‌మెంట్ తదితర పథకాల ద్వారా లబ్ధిపొందిన వారంతా వైకాపా అభ్యర్థికి ముందు ఓటేస్తారన్నారు. రాష్ట్రంలో 4శాతం రిజర్వేషన్లు కల్పించి వైఎస్ ముస్లింలకు ఎంతో మేలు చేస్తే కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం 4.5శాతం ఓబిసి కోటాతో ముస్లింలను మోసం చేసిందన్నారు. జనాభా దామాషా ప్రకారం, ఆర్థిక వెనుకబాటు ప్రాతిపదికన చిత్తశుద్ధితో పాలకులు రిజర్వేషన్లు కల్పించే వరకు పోరాడుతామని, ఇందుకోసం ముస్లింలంతా ఐక్యం కావాలని అబ్దుల్ అజీజ్ పిలుపునిచ్చారు.


నెల్లూరు పెద్దబజారు ప్రచారంలో అబ్దుల్ అజీజ్.

అబ్దుల్ అజీజ్ తన పాదయాత్రకు ఇంత పెద్దఎత్తున ముస్లిం మత పెద్దలు, యువత తరలి రావడం ఆనందించదగిన విషయం అని అన్నారు. అన్ని సమయాల్లో, అన్ని విషయాల్లో వీరికి అండదండలు అందిస్తామని అన్నారు. 300 మందికిపైగా యువకులు ఈ పాదయాత్రలో పాల్గొన్నారు. వీరితోపాటు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ మైనార్టీ నేతలు అబ్దుల్ జలీల్, ఇలియాజ్, మౌలానా అజీజ్, యజ్దాన్, వేమిరెడ్డి హరికృష్ణారెడ్డి, ఎ.కిషోర్‌రెడ్డి, షబ్బీర్, అహ్మద్, రఫీ వుల్లాసా, హాజీ నజీర్, న్యామతుల్లా, సయ్యద్, గయాజ్, అబ్బు, ఇస్మాయిల్, మహీ, ఫసీ వున్నారు.

# జగన్‌కు ఎందుకు ఓటు వేయాలి?

అది....
వెర్రా,
వ్యామోహమా,
ఉన్మాదమా,
సాక్షి టీవీ చేస్తున్న హిప్నాటిజమా

ఏదీ కాకుంటే మానసిక వైకల్యమా... కారణం తెలియదు కానీ, ఇప్పటికిప్పుడు రాజకీయ పరిస్థితి చూస్తే ఆంధ్ర ప్రాంతం మొత్తం జగన్ మోజనే పిచ్చి ప్రవాహంలో తల మునకలౌతున్నది. అదొక వేలం వెర్రిగా కన్పిస్తున్నది.

అవినీతి చూడడం లేదు...
నేర చరిత్ర చూడడం లేదు...
అరెస్టులు చూడడం లేదు...
అభ్యర్థిని చూడడం లేదు...
అసలేదీ పట్టించుకోవడం లేదు...

జగన్... జగన్.... జగన్.... అంటూ పలవరిస్తున్నారు జనం. కలవరిస్తున్నారు జనం. సాక్షి టీవీ ముందు కూర్చుని అదేపనిగా విజయమ్మ ప్రచార యాత్రను చూస్తున్నారు. కొందరైతే ఆమె కంటతడి చూసి తామూ కన్నీళ్లు పెడుతున్నారు. జగన్‌కు ఏదో అన్యాయం జరిగిపోయిందని ఆవేదన చెందుతున్నారు. రేపటి ఎన్నికలలో మా ఓట్లన్నీ జగన్‌కే అని కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పేస్తున్నారు. అధికార పార్టీ ఎమ్మెల్యే అని, మంత్రి అని కూడా చూడకుండా బయటపడి మాట్లాడేస్తున్నారు.

ఏమిటీ వేలం వెర్రి? ప్రజాస్వామ్యానికి ఎంత ప్రమాదకరమైన పరిణామం ఇది? రాజకీయవాదుల గుణగణాలు చూడకుండా, మంచి చెడుల విచక్షణ లేకుండా ఏదో ఒక వ్యామోహంతో, వెర్రితో, ఉన్మాదంతో ఓటు వేసే ధోరణి ప్రబలితే దేశం ఏమైపోతుంది? రౌడీలు, గూండాలు, దొంగలు, బందిపోట్లు, నేరస్తులు, హంతకులు ప్రభుత్వాలను నడిపే దుర్గతి దాపురించిందా?

అసలింతకీ జగన్ మీద ఎందుకింత మోజు? ఆయన చేసింది, చేయబోతున్నది ఏమిటి? ఆయనకే ఓటు వేయాలని చదువుకొన్నవారు, చదువురాని వారు, మేధావులు, పామరులు, పేదవాళ్లు, ధనవంతులు మూకుమ్మడిగా నిర్ణయం తీసుకోవడానికి జగన్‌లో వారేమి చూస్తున్నారు? దేని నుంచి ప్రేరణ పొందుతున్నారు?

## తండ్రి చావుకంటే వ్యాపారం ఎక్కువా?

జగన్, వైఎస్.రాజశేఖర్‌రెడ్డి కుమారుడు. అది తప్ప ఆయనకు వేరొక అర్హత లేదు. పరిచయమూ లేదు. ఆయనింతకాలం చేసిన ప్రజాసేవా ఏదీ లేదు. ప్రజల మేలు కోసం గొప్ప గొప్ప ఆలోచనలు చేసిన వాడూ కాదు. తండ్రి బ్రతికి వున్నంతకాలం, ఆయన అక్రమంగానో, సక్రమంగానో సంపాదించి ఇచ్చిన సొత్తును కూడబెట్టుకొన్నాడు. బెంగుళూరులో కూచుని, దాన్ని ఖర్చు చేసి, మైసూర్ మహారాజా ప్యాలెస్‌ను మించిన ఇల్లు కట్టుకొన్నాడు. విలాసాలు అనుభవించాడు. తన తండ్రి మరణించే సమయానికి జగన్ వున్నది కలకత్తాలోని ఒక పంచ నక్షత్రాల హోటల్‌లో. పొద్దున తండ్రి ప్రయాణిస్తున్న హెలికాప్టర్ కనపడకుండా పోతే, అర్ధరాత్రికి కానీ జగన్ హైదరాబాద్‌కు చేరలేదు. తన తండ్రి చావు బ్రతుకుల సమస్య కంటే, కలకత్తాలో తన వ్యాపారాలు, విలాసాలే ఎక్కువైనాయి ఆయనకు ఆ రోజు. వచ్చినవాడు తండ్రి మరణానికి విలపించ లేదు. ఎందుకు చనిపోయాడన్న ఆరా తీయలేదు. తండ్రి స్థానంలో తాను ముఖ్యమంత్రి కావడానికి పైరవీలు చేశాడు. తండ్రి శవాన్ని చూడడానికి వచ్చిన ఎమ్మెల్యేల చేత సంతకాలు పెట్టించాడు. సానుభూతి తెలపడానికి వచ్చిన సోనియాగాంధీతో తనను ముఖ్యమంత్రిని చేయమని ప్రాధేయపడ్డాడు. ఆపద్ధర్మ ముఖ్యమంత్రిగా నియమితులైన సీనియర్ కాంగ్రెస్‌వాది, వయస్సులో తనకంటే మూడు రెట్లు పెద్ద అయిన పెద్ద మనిషి రోశయ్య తనను కలవడానికి వస్తే, నా కుర్చీలో నువ్వెట్లా కూర్చుంటావని గద్దించాడు. ఇదంతా చరిత్ర. అందరికీ తెలిసిన నిజం.

కానీ ఇప్పుడదే జగన్, తన తండ్రి చావు అనుమానాస్పదమన్నట్లు, ఆయన్ను కాంగ్రెస్‌వాదులే చంపినట్లు ప్రచారం చేస్తున్నాడు. పచ్చిగా ఆరోపణలు గుప్పిస్తున్నాడు. తన తల్లి చేత మాట్లాడిస్తున్నాడు. తన పత్రికలో, టీవీలో పదే పదే ప్రచారం చేస్తున్నాడు. జనం మనసులను అనుమానపు మేఘాలతో నింపుతున్నాడు. తద్వారా వారి సానుభూతి పొంది, ఓట్లు కొల్లగొట్టాలని చూస్తున్నాడు. పచ్చిగా చెప్పాలంటే తన తండ్రి శవంతో, చావుతో రాజకీయ వ్యాపారం చేస్తున్నాడు. ఇంత హీనంగా, హేయంగా ప్రవర్తిస్తున్న వ్యక్తిని జన నేతగా జనం ఆరాధించడం ఏమిటి? అభిమానించడం దేనికి? అందుకు జనం చెప్తున్న సమాధానం... రాజశేఖరరెడ్డి చేసిన మేలు. ఆయన ఆరోగ్యశ్రీ వరం ఇచ్చాడు. పావలా

కొరవ 10వ పేజీలో

# తెలుగుదేశం గాలి వీస్తుంది!

నెల్లూరు పార్లమెంట్ నియోజకవర్గ పరిధిలో తెలుగుదేశం పార్టీ గాలి వీస్తోందని, దానిని తెలివిగా మలుచుకొంటే ఉపఎన్నికల్లో గెలుపు పార్టీదేనని తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు నారా చంద్రబాబు నాయుడు చెప్పారు. మే చివరి వారంలో జిల్లాలోని కావలి నియోజకవర్గ పరిధిలోని అల్లూరు, దగదర్తి, బిట్రగుంటలలో పర్యటించిన చంద్రబాబు నాయుడు మాట్లాడుతూ జగన్మోహన్‌రెడ్డి దోపిడీ, అక్రమాస్తులు, అవినీతి వ్యవహారాలను ప్రజలు బాగా అర్థం చేసుకొంటున్నారు. ప్రస్తుతం జైలులో వున్న జగన్‌కు ప్రజాదరణ తగ్గిందని చెప్పేందుకు జగన్ అరెస్ట్ తర్వాత ఎలాంటి ఆందోళనలు లేకపోవడమే ఉదాహరణన్నారు. పార్టీలో పనులను విభజించుకుని ప్రచారం, ఓటర్లను వ్యక్తిగతంగా కలిస్తే జయం మనదేనని కార్యకర్తల్లో ఉత్సాహం నింపారు.

## రెండు కంపెనీల పోటీ!

నెల్లూరు పార్లమెంట్ స్థానం నుంచి కెఎంసీ, గాయత్రి కంపెనీలు పోటీ చేస్తున్నాయని చంద్రబాబు విమర్శించారు. జూన్ 1తేది ఉదయగిరి నియోజకవర్గ పరిధిలోని కొండాపురం, సీతారాంపురం, ఉదయగిరిలలో రోడ్డు షోలు చేశారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ వైఎస్.జగన్ బినామీ కంపెనీనే కెఎంసీ అన్నారు. జగన్ దోచుకొన్న సొమ్మును కెఎంసీలో పెట్టుబడులు పెట్టారని, దానికి ప్రతిఫలంగా మేకపాటి సోదరులు జగన్ పంచన చేరారన్నారు. మూడేళ్లు ఎమ్పీగా ఉన్న రాజమోహన్‌రెడ్డి ఏనాడూ పార్లమెంట్‌లో మాట్లాడలేదని చంద్రబాబు గుర్తు చేశారు. మెట్ట ప్రాంతమైన ఉదయగిరి ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు తెలుగుదేశం పార్టీనే తీర్చగలుగుతుందన్నారు.

## క్రిమినల్స్‌కు ఓట్లు వేయెద్దు!

నేరచరిత్రగల జగన్ లాంటి వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకులకు ఓట్లేస్తే రాష్ట్రంలో ఫ్యాక్షన్ రాజకీయాలను ప్రోత్సహించినట్లవుతుందని నెల్లూరు పార్లమెంట్ నియోజకవర్గ తెలుగుదేశం అభ్యర్థి వంటేరు వేణుగోపాలరెడ్డి అన్నారు. 30 తేది కందుకూరులో ఆయన ఎన్నికల ప్రచారం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ పేద, బడుగు, బలహీన వర్గాల అభివృద్ధి కోసం తెలుగుదేశం పార్టీ విశేషకృషి చేసిందన్నారు. ప్రస్తుతం రాష్ట్రంలో రావణ రాజ్యం నడుస్తున్నదని, మళ్లీ రామరాజ్యం రావాలంటే తెలుగుదేశం పార్టీకి ఓట్లేసి గెలిపించాలని వంటేరు విజ్ఞప్తి చేశారు. కందుకూరులోని ఒడేవారిపాళెం, వాలేటివారిపాళెం ప్రాంతాల్లో మాజీ ఎమ్మెల్యే దివి శివరాంతో కలసి వేణుగోపాలరెడ్డి ఎన్నికల ప్రచారం నిర్వహించారు.



వంటేరును ఆత్మీయంగా పలకరిస్తున్న మహిళ.



బుజబుజ నెల్లూరు ప్రచారంలో వంటేరు వేణుగోపాల్‌రెడ్డి, చంద్రమోహన్‌రెడ్డి.



ఉదయగిరి ప్రచారంలో చంద్రబాబు, వంటేరు, బొల్లినేని రామారావు.

## ఎన్టీఆర్ జయంతిని అడ్డుకోవడమేమిటి?

జగన్‌లాంటి అవినీతి పరుడ్ని అరెస్ట్‌చేస్తే రాష్ట్రమంతా 144 సెక్షన్ విధించి ఎన్టీఆర్ జయంతిని అడ్డుకోవడం ప్రజాస్వామ్యానికే మాయనిమచ్చని వేణుగోపాల్‌రెడ్డి విమర్శించారు. ఎన్టీఆర్ 90వ జయంతిని పురస్కరించుకొని నెల్లూరు నర్తకి సెంటర్‌లో ఎన్టీఆర్ విగ్రహానికి పూలమాలవేసి నివాళులర్పించి మాట్లాడారు. పోలీసులు 144 సెక్షన్ పేరుతో ఎన్టీఆర్ విగ్రహానికి పూలమాలలు వేయకుండా అడ్డుకోవడం విచారకరమన్నారు. తెలుగు జాతి గర్వించదగ్గ నాయకుడు పేద, బడుగు, బలహీనవర్గాల అభివృద్ధే ధ్యేయంగా తన రాజకీయ ప్రస్థానాన్ని కొనసాగించిన ఘనత ఎన్టీఆర్‌దేనన్నారు.

# తెలుగుదేశంతోనే దళితుల అభివృద్ధి!

తెలుగుదేశం పార్టీ హయాంలోనే దళితుల అభివృద్ధి జరిగిందని సూళ్లూరుపేట శాసన సభ్యుడు పరసా రత్నం స్పష్టం చేశారు. ఉదయగిరి నియోజకవర్గంలో ఆ పార్టీ అభ్యర్థి బొల్లినేని రామా రావుకు మద్దతుగా ఎన్నికల ప్రచారం నిర్వహించారు. కొండాపురం, ఉదయగిరి, జలదంకి మండలాల్లో పర్యటించిన ఆయన మాట్లాడుతూ తెలుగుదేశం పార్టీ వ్యవస్థాపకుడు ఎన్టీరామారావు దళితులు, బిసిలు, మైనార్టీల అభ్యున్నతికి విశేష కృషి చేశారన్నారు. అదే బాటలో చంద్రబాబు పయనిస్తున్నాడన్నారు. రాష్ట్రం అభివృద్ధి చెందిందంటే అది తెలుగుదేశం పార్టీ పుణ్య మేనన్నారు. నిస్వార్థపరుడు, ప్రజల మనిషి అయిన బొల్లినేని రామారావును గెలిపించాలని కోరారు. టిడిపి అభ్యర్థి బొల్లినేని రామారావు మాట్లాడుతూ ఎమ్మెల్యేగా వ్యవహరించిన మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి ఈ ప్రాంత అభివృద్ధికి చేసిందేమీ లేదన్నారు. రాజకీయాలను అడ్డం పెట్టుకొని కోట్లు సంపాదించారన్నారు. తాను

**సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసారత్నం**

కష్టపడి వ్యాపారాల్లో సంపాదించిన సొమ్ముతో ప్రజలకు సేవచేయడానికి రాజకీయాల్లోకి వచ్చానన్నారు. ఒక్కసారి అవకాశం ఇచ్చి గెలిపించినట్లైతే ఉదయగిరి రూపురేఖలు మారుస్తానని హామీ ఇచ్చారు.

# వైఎస్ అమలు చేసింది కాంగ్రెస్ మ్యానిఫెస్టోనే!

**కావలిలో టి.సుబ్బరామిరెడ్డి**



ముఖ్యమంత్రిగా వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కేవలం కాంగ్రెస్‌పార్టీ మ్యానిఫెస్టోలోని అంశాలను మాత్రమే అమలు చేశారు తప్ప సొంతంగా చేసిందేమీ లేదని కాంగ్రెస్ పార్లమెంటు అభ్యర్థి తిక్కవరపు సుబ్బరామిరెడ్డి తెలిపారు. కావలి పట్టణం షాదీమంజిల్‌లో ముస్లింలతో ఆయన సమావేశం నిర్వహించారు. ఆది నుంచి కాంగ్రెస్ పార్టీ ముస్లింలకు వెన్నుదన్నుగా వుందన్నారు. దీనిని ఎవరూ కాదనలేదన్నారు. కోట్ల విజయభాస్కర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్న సమయంలోనే ముస్లింలకు ఐదుశాతం రిజర్వేషన్ కల్పించాలని కాంగ్రెస్‌పార్టీ నిర్ణయం తీసుకొందన్నారు. ఆ విషయాన్ని మ్యానిఫెస్టోలోను ప్రతిపాదించినది తెలియజేశారు. అయితే ఆ తరువాత కాంగ్రెస్‌పార్టీ అధికారంలోకి రాకపోవడంతో దానిని అమలు చేసే అవకాశం కాంగ్రెస్ పార్టీకి లభించలేదన్నారు. జిల్లాలోని ముస్లింలందరికి తనవంతు సహాయ సహకారాలను అందిస్తానని హామీ ఇచ్చారు.

# నిర్లక్ష్య వైద్యసిబ్బందికి మెమోలు!

**డిఎంఅండ్‌హెచ్‌ఓ ఆదేశం**

విధి నిర్వహణలో నిర్లక్ష్యంగా వ్యవహరించిన వైద్య, ఆరోగ్యశాఖ సిబ్బందికి మెమోలు జారీ చేయాలని జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ మాశిలామణి ఆదేశించారు. ఇటీవల కావలి సబ్‌డివిజన్ పరిధిలోని గుట్టుపల్లి, జలదంకి, తుమ్మలపెంట, కోవూరుపల్లి, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను డిఎంఅండ్‌హెచ్‌ఓ ఆకస్మికంగా తనిఖీలు చేయడం జరిగింది. ఆరోగ్య కేంద్రాల్లో విధులు నిర్వహించాల్సిన సిబ్బంది రిజిష్టర్‌లో సంతకాలు చేసి బయటకు వెళ్లిపోవడం ఆయన గుర్తించారు. దీంతో ఆగ్రహం చెంది మెమోలు జారీ చేయాలని సంబంధిత వైద్యులను ఆదేశించారు.

# టిఎస్ఆర్‌కు నెల్లూరు ఇప్పుడు గుర్తొచ్చిందా?

● **బీద రవిచంద్ర విమర్శ**

కాంగ్రెస్‌పార్టీ పార్లమెంటు అభ్యర్థి తిక్కవరపు సుబ్బరామిరెడ్డికి నెల్లూరులో పోటీ చేయాల్సి వచ్చినప్పుడే జన్మభూమి గుర్తుకు వచ్చిందా అని తెలుగుయువత రాష్ట్ర అధ్యక్షుడు బీద రవిచంద్ర ఎద్దేవా చేశారు. జన్మస్థలమైన ఇందుకూరుపేట మండలానికి ఆయన ఏమి చేశారో చెప్పాలని సూటిగా ప్రశ్నించారు. కావలి తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో జరిగిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ ఏరోజూ జిల్లా మొహం చూడని ఆయన విధిలేని పరిస్థితుల్లో నెల్లూరులో పోటీ చేయాల్సి రావడంతో ఉన్నపళంగా జన్మభూమిపై ప్రేమ పొంగుకొచ్చిందని విమర్శించారు. మాటి మాటికి వైజాగ్‌ను అభివృద్ధి చేసినట్లు నెల్లూరును అభివృద్ధి చేస్తానని సుబ్బరామిరెడ్డి చెప్తున్నారని, వాస్తవానికి వైజాగ్‌లో ఆయన చేసిన అభివృద్ధి అంటూ ఏమీ లేదన్నారు. చివరకు టిటిడి ఛైర్మన్‌గా వున్నప్పుడు ఆయన నెల్లూరులో జరిగిన ఏ ఆధ్యాత్మిక కార్యక్రమానికి హాజరు కాలేదన్నారు. అలాంటిది ఈ ఎన్నికలలో కోట్ల రూపాయలు వెదజల్లి గెలవాలని చూస్తున్నాడని దుయ్యబట్టారు.



# ఆ రెండూ... దొంగల పార్టీలు!

● **అల్లూరులో చంద్రబాబు**

కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు దొంగ, గజదొంగల పార్టీలని తెలుగుదేశంపార్టీ అధినేత నారా చంద్రబాబు నాయుడు విమర్శించారు. ఉప ఎన్నికల ప్రచారంలో భాగంగా ఆయన జిల్లాలోని వివిధ నియోజకవర్గాలలో విస్తృతంగా పర్యటించారు. అల్లూరులో ఆ పార్టీ కార్యకర్తల సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగం ఆద్యంతం కార్యకర్తలను ఉత్సాహపరచేలా సాగింది. నేను ఏ పదవిలో వున్నా , ఏస్థాయిలో వున్నా నా మనసు ఎప్పుడూ మీ మధ్య వుంటుందన్నారు. నాయకులు పార్టీని దెబ్బతీసిన సందర్భాలు ఎన్నో వున్నాయని, కార్యకర్తలు మాత్రం పార్టీకి ఎప్పుడూ వెన్నుదన్నుగా వున్నారన్నారు. నేతల కన్నా ప్రాణ సమానులైన కార్యకర్తలకు ఎప్పుడూ ప్రాధాన్యం ఇస్తానని ఉద్వేగభరితంగా ప్రసంగించడంతో కార్యకర్తలు కేరింతలు కొట్టారు. ఎనిమిదేళ్ల కాంగ్రెస్ పాలనలో రాష్ట్రం అన్ని రంగాలలో వైఫల్యం చెందిందని, అన్ని వస్తువుల ధరలు పెరిగి ప్రజలు అవస్థలు పడుతున్నా పట్టించుకోనేవారే లేకుండా పోయారని విమర్శించారు. బిసిల రిజర్వేషన్‌లను కుదించి మైనార్టీలకు ఇవ్వడాన్ని కోర్టు కొట్టేయడంపై మాట్లాడుతూ కాంగ్రెస్ ప్రభుత్వం ముస్లింలను ఎప్పుడూ మోసం చేస్తున్నదని గుర్తు చేశారు. బిసిలకు రాజ్యాధికారం కల్పించింది తెలుగుదేశం పార్టీయేనన్నారు. టిడిపి అభ్యర్థి వంటేరు వేణు గోపాలరెడ్డి సౌమ్యుడని, పేదల కష్టాలు తెలిసిన మనిషని అలాంటి వ్యక్తిని గెలిపించాలని కోరారు. ఈ సమావేశంలో టిడిపి అభ్యర్థి వంటేరు వేణు గోపాలరెడ్డి, కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్ రావు, టిడిపి జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్ర మోహన్‌రెడ్డి, వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ, తెలుగుయువత రాష్ట్ర అధ్యక్షుడు బీద రవిచంద్ర, బుచ్చయ్య చౌదరి, తీగల కృష్ణారెడ్డి, అల్లంపాటి విజయవర్ధన్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

● **వివాదం తెచ్చిన**

# ఉపాధిహామీ పనులు!

దొరవారిసత్రం మండల పరిధిలోని వడ్డికండ్రిగ గ్రామంలో ఉపాధిపనుల విషయంలో తలెత్తిన వివాదం పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేసుకొనే వరకు వెళ్లింది. పనుల విషయమై ఇరువర్గాల మధ్య నెలకొన్న వివాదం చిలికి చిలికి గాలివానలా మారింది. సిఐ మాణిక్యారావు ఇరువర్గాలను పిలిపించి విచారించినప్పటికీ ఫలితం లేకపోవడం, పోలీసుల ఎదుటే గొడవకు దిగడంతో కొందరిని అదుపులోకి తీసుకొన్నారు. ఈ నేపథ్యంలో శాంతి భద్రతల దృష్ట్యా ఎంపిడిఓ సురేష్‌బాబు ఉపాధి పనులను నిలిపి వేస్తున్నట్లు ప్రకటించారు. దీంతో షుమారు 60మంది కూలీలు ఉపాధి కోల్పోవలసి వచ్చింది.



# DR. SRK. SCHOOL

(Recognised by the Govt of A.P.)

Magunta Layout, Nellore - 524 003. Ph: 2325199

ప్రతి విద్యార్థి ప్రగతే మా లక్ష్యం : : ప్రతిభగల ఉపాధ్యాయులు – విద్యార్థుల మేలి కలయిక

## SSC Results - 2012

| No. | Name | Tel | Hin | Eng | Mat | Sci | SS | Grade |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | R.Krishna Kishore | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 2. | N.Greeshmi Chowdary | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 3. | D.Haasith | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 4. | V.Monika | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 5. | K.Pranathi Reddy | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 6. | U.Sai Akhil | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 7. | P.Bhargava Sathvika | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 8. | I.Nikhil | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 9. | C.Sai Teja | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 10. | S.Pavani | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 11. | K.Saketh | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 12. | M.Spandana | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 13. | C.Sathwic Reddy | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 14. | K.Lohitha | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 15. | G.Malavika | 10 | 10 | 9 | 10 | 10 | 10 | 9.8 |
| 16. | M.Praveen Kumar | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 17. | N.Ranadheer Reddy | 9 | 10 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 18. | M.Vivek | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 19. | B.Harshitha Soundarya | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 20. | M.Sindhuja Reddy | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 21. | C.Meghana | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 22. | N.Venkata Sai Sriram | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 23. | P.Venkata Susmitha | 10 | 10 | 8 | 10 | 10 | 10 | 9.7 |
| 24. | T.Sriharsha | 9 | 10 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 25. | M.Khyathi Keerthana | 10 | 9 | 9 | 10 | 10 | 10 | 9.7 |
| 26. | M.Hari Krishna | 10 | 9. | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 27. | T.Sai Phani Thej | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 28. | Ch.Nuthna Lakshmi Sarojini | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 29. | P.Sai Tharun | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 30. | V.Sai Gowtham Reddy | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 31. | S.Nitesh | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 32. | P.Rohitha Reddy | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 33. | K.Radha Praneetha | 10 | 10 | 7 | 10 | 10 | 10 | 9.5 |
| 34. | M.Shanmukh Sai | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 35. | D.Giri Sreehitrha | 10 | 10 | 7 | 10 | 10 | 10 | 9.5 |
| 36. | G.Venkata Shanumkha Sai Saketh | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 37. | N.Deepthi | 9 | 9 | 9 | 10 | 10 | 10 | 9.5 |
| 38. | D.Pranavi | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 39. | J.Laasya Priya | 9 | 10 | 9 | 10 | 10 | 9 | 9.5 |
| 40. | V.Venkata Saikota Krishna Karthik | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 41. | Arava Samanvaya | 10 | 10 | 8 | 10 | 10 | 9 | 9.5 |
| 42. | V.Kavya | 10 | 9 | 9 | 10 | 9 | 10 | 9.5 |
| 43. | M.Hemalatha | 9 | 9 | 9 | 10 | 10 | 10 | 9.5 |
| 44. | N.Subhash Yadav | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 45. | M.Vidya | 10 | 10 | 7 | 10 | 10 | 10 | 9.5 |
| 46. | M.Anish Srivathsav | 9 | 10 | 8 | 10 | 10 | 10 | 9.5 |
| 47. | K.Sowjanya | 10 | 9 | 9 | 10 | 10 | 9 | 9.5 |
| 48. | Ch.Anudeep | 10 | 10 | 8 | 10 | 10 | 9 | 9.5 |
| 49. | M.Aakarsh | 10 | 10 | 7 | 10 | 10 | 10 | 9.5 |
| 50. | P.Varshith Reddy | 10 | 9 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 51. | G.Ramkoushik Reddy | 8 | 10 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 52. | D.Lakshmi Priya | 9 | 10 | 8 | 10 | 9 | 10 | 9.3 |
| 53. | T.Raja Rajeswari | 10 | 9 | 7 | 10 | 10 | 10 | 9.3 |
| 54. | Y.Neelima Reddy | 10 | 9 | 7 | 10 | 10 | 10 | 9.3 |
| 55. | K.Jahnavi | 9 | 10 | 9 | 9 | 9 | 10 | 9.3 |
| 56. | V.Ramya | 10 | 9 | 7 | 10 | 10 | 10 | 9.3 |
| 57. | K.Sai Akshaya Priya | 10 | 9 | 8 | 9 | 10 | 10 | 9.3 |
| 58. | V.Sowmya | 10 | 10 | 7 | 10 | 10 | 9 | 9.3 |
| 59. | Z.Subramanyam | 9 | 10 | 7 | 10 | 10 | 10 | 9.3 |
| 60. | K.Vasudev Rao | 9 | 9 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 61. | S.Venkata Bhavesh | 10 | 9 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 62. | K.Akhila | 10 | 9 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 63. | N.Sai Chand Chowdary | 10 | 8 | 9 | 10 | 10 | 9 | 9.3 |
| 64. | Ch. Varshitha Preethi | 10 | 9 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 65. | C.Nikitha | 10 | 9 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 66. | E.Bhaveena | 9 | 9 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 67. | A.Mohan Reddy | 10 | 9 | 7 | 10 | 10 | 10 | 9.3 |
| 68. | V.Venkata Sai Sasi Preetham | 9 | 10 | 7 | 10 | 10 | 10 | 9.3 |
| 69. | V.Venkata Sai Nithin Krishna | 10 | 10 | 7 | 10 | 10 | 9 | 9.3 |
| 70. | C.Venkata Suma Prathyusha | 8 | 10 | 9 | 10 | 10 | 9 | 9.3 |
| 71. | B.Lakshmi Venkata Dileep | 10 | 10 | 8 | 9 | 10 | 9 | 9.3 |
| 72. | C.Sai Abhaya Priya | 10 | 8 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 73. | CH.Maheswari | 8 | 10 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 74. | M.Vishnu Vardhan | 9 | 9 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 75. | G.Lakshmi Sairama Sathyadev | 9 | 9 | 8 | 10 | 10 | 10 | 9.3 |
| 76. | A.Rachana Sree | 10 | 9 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 77. | K.Haritha | 10 | 10 | 8 | 9 | 10 | 9 | 9.3 |
| 78. | P.Divya | 9 | 10 | 7 | 10 | 10 | 10 | 9.3 |
| 79. | K.Pradeepa Sai | 10 | 9 | 7 | 10 | 10 | 10 | 9.3 |
| 80. | T.Sivani | 10 | 10 | 7 | 10 | 9 | 10 | 9.3 |
| 81. | Y.Sai Sruthi | 9 | 10 | 8 | 10 | 10 | 9 | 9.3 |
| 82. | T.Naga Venkata Naveen | 10 | 8 | 7 | 10 | 10 | 10 | 9.2 |
| 83. | D.Hasya | 9 | 9 | 9 | 10 | 9 | 9 | 9.2 |
| 84. | T.Sai Anju Priya | 10 | 9 | 7 | 10 | 9 | 10 | 9.2 |
| 85. | Ch.Vema Sahithi Veena | 10 | 8 | 8 | 10 | 10 | 9 | 9.2 |
| 86. | V.Srivagdevi | 9 | 10 | 7 | 10 | 10 | 9 | 9.2 |
| 87. | S.Deepthi | 9 | 9 | 7 | 10 | 10 | 10 | 9.2 |
| 88. | K.Naveen | 10 | 8 | 8 | 10 | 10 | 9 | 9.2 |
| 89. | Md.Omar Abdul Aziz | 8 | 9 | 9 | 10 | 9 | 10 | 9.2 |
| 90. | Sk.Waheeda Begum | 8 | 9 | 8 | 10 | 10 | 10 | 9.2 |
| 91. | K.Sai Manogna | 10 | 9 | 7 | 10 | 10 | 9 | 9.2 |
| 92. | K.Sai Rahul Reddy | 10 | 9 | 7 | 9 | 10 | 10 | 9.2 |
| 93. | V.Sindhu Aparna | 10 | 9 | 7 | 10 | 10 | 9 | 9.2 |
| 94. | Ch.Pranavi | 9 | 9 | 8 | 9 | 10 | 10 | 9.2 |
| 95. | A.Greeshma Sai | 10 | 8 | 7 | 10 | 10 | 9 | 9.0 |
| 96. | C.Sai Divya | 10 | 9 | 8 | 9 | 9 | 9 | 9.0 |
| 97. | P.Vishnu Vikas | 10 | 9 | 6 | 10 | 10 | 9 | 9.0 |
| 98. | U.Venkata Pradeep Varma | 9 | 8 | 8 | 10 | 10 | 9 | 9.0 |
| 99. | Sd.Ayesha Begum | 9 | 9 | 7 | 10 | 9 | 10 | 9.0 |
| 100. | R.Chakresh | 9 | 9 | 8 | 10 | 9 | 9 | 9.0 |
| 101. | N.Leela Abhinay | 9 | 9 | 8 | 10 | 9 | 9 | 9.0 |
| 102. | Z.Srilakshmi | 9 | 9 | 7 | 9 | 10 | 10 | 9.0 |
| 103. | S.Sai Sushma | 8 | 9 | 8 | 10 | 10 | 9 | 9.0 |
| 104. | G.Sai Santhan Reddy | 10 | 8 | 7 | 10 | 9 | 10 | 9.0 |
| 105. | K.Hari Charan | 9 | 9 | 7 | 10 | 10 | 9 | 9.0 |
| 106. | Ch.Ujwala | 9 | 8 | 8 | 10 | 10 | 9 | 9.0 |
| 107. | P.Venkata Sai Harsha Vardhan | 10 | 10 | 6 | 9 | 10 | 9 | 9.0 |
| 108. | G.Pavan Teja | 9 | 8 | 8 | 9 | 10 | 9 | 8.8 |
| 109. | S.Narayana Dinakar | 9 | 8 | 6 | 10 | 10 | 10 | 8.8 |
| 110. | K.Srivaishnavi | 9 | 9 | 7 | 9 | 9 | 10 | 8.8 |
| 111. | B.Greeshma | 9 | 8 | 7 | 9 | 10 | 10 | 8.8 |
| 112. | G.Likitha Choudary | 10 | 7 | 6 | 10 | 10 | 10 | 8.8 |
| 113. | K.Sai Sreeram | 9 | 9 | 7 | 10 | 9 | 9 | 8.8 |
| 114. | K.Prem Sai | 9 | 9 | 7 | 9 | 9 | 10 | 8.8 |
| 115. | A.Venkata Ravi Teja | 9 | 8 | 8 | 10 | 9 | 9 | 8.8 |
| 116. | M.Hemasree | 9 | 9 | 7 | 9 | 10 | 9 | 8.8 |
| 117. | K.Venkat Akhil | 9 | 8 | 7 | 10 | 9 | 9 | 8.7 |
| 118. | C.Sai Shalini | 9 | 8 | 7 | 10 | 9 | 9 | 8.7 |
| 119. | K.Venkata Sai Poojith | 8 | 8 | 7 | 9 | 10 | 10 | 8.7 |
| 120. | M.Mounika | 9 | 7 | 8 | 10 | 9 | 9 | 8.7 |
| 121. | Sk.Meera Modin | 7 | 8 | 7 | 10 | 10 | 10 | 8.7 |
| 122. | T.Venkata Gnaneswara Rao | 8 | 9 | 6 | 10 | 10 | 9 | 8.7 |
| 123. | P.Akshay | 9 | 7 | 8 | 9 | 9 | 10 | 8.7 |
| 124. | R.Bhargavi | 9 | 7 | 8 | 9 | 9 | 10 | 8.7 |
| 125. | G.Karheek | 9 | 8 | 6 | 10 | 9 | 10 | 8.7 |
| 126. | E.Lokesh | 7 | 9 | 7 | 9 | 10 | 10 | 8.7 |
| 127. | Y.Harika | 9 | 8 | 7 | 10 | 9 | 9 | 8.7 |
| 128. | D.Santhan Raj | 9 | 8 | 7 | 10 | 9 | 9 | 8.7 |
| 129. | M.Prathima | 8 | 8 | 7 | 10 | 10 | 9 | 8.7 |
| 130. | G.Srivyshnavi | 10 | 8 | 7 | 10 | 9 | 8 | 8.7 |
| 131. | T.Sai Neelesh Kumar | 8 | 9 | 7 | 10 | 9 | 8 | 8.5 |
| 132. | M.Summaya | 8 | 8 | 6 | 10 | 9 | 10 | 8.5 |
| 133. | S.Reshma Sree Keethi Reddy | 10 | 8 | 7 | 9 | 8 | 9 | 8.5 |
| 134. | K.Devasena | 9 | 8 | 7 | 9 | 9 | 9 | 8.5 |
| 135. | R.Lasya Yadav | 9 | 9 | 6 | 9 | 9 | 9 | 8.5 |
| 136. | P.Chandana | 7 | 9 | 7 | 10 | 9 | 9 | 8.5 |
| 137. | S.Lakshmi Mallika | 9 | 9 | 8 | 8 | 8 | 8 | 8.3 |
| 138. | A.Lakshmi Sravya | 9 | 9 | 6 | 9 | 8 | 9 | 8.3 |
| 139. | K.Kranthi Kumar | 8 | 8 | 7 | 8 | 10 | 9 | 8.3 |
| 140. | G.Nethaji | 8 | 8 | 8 | 9 | 8 | 9 | 8.3 |
| 141. | M.Lokesh Datta | 9 | 7 | 7 | 10 | 9 | 8 | 8.3 |
| 142. | M.Hitesh Narayana | 7 | 8 | 7 | 10 | 9 | 9 | 8.3 |
| 143. | N.Kalavani | 9 | 9 | 8 | 8 | 9 | 7 | 8.3 |
| 144. | N.Guru Sandeep Reddy | 9 | 7 | 7 | 9 | 9 | 9 | 8.3 |
| 145. | G.Chakresh | 8 | 9 | 5 | 10 | 9 | 9 | 8.3 |
| 146. | T.Swarna Latha | 9 | 9 | 5 | 9 | 9 | 9 | 8.3 |
| 147. | P.Nagendra | 9 | 10 | 7 | 9 | 8 | 7 | 8.3 |
| 148. | G.Prem Chand | 8 | 7 | 6 | 9 | 10 | 9 | 8.2 |
| 149. | C.Rupanarayanan | 8 | 8 | 7 | 9 | 9 | 8 | 8.2 |
| 150. | V.Sai Prasanthi | 9 | 8 | 7 | 8 | 9 | 8 | 8.2 |
| 151. | Ch.Rohith | 9 | 8 | 6 | 9 | 8 | 9 | 8.2 |
| 152. | A.Sasidhar | 9 | 7 | 7 | 9 | 8 | 9 | 8.2 |
| 153. | Y.Purushotham | 6 | 8 | 5 | 10 | 9 | 10 | 8.0 |
| 154. | S.Nikhil Kumar | 9 | 5 | 8 | 9 | 8 | 9 | 8.0 |
| 155. | V.Bharath | 9 | 8 | 7 | 7 | 9 | 8 | 8.0 |
| 156. | S.Mounica Krishna | 7 | 8 | 7 | 8 | 9 | 9 | 8.0 |
| 157. | K.Kavya | 8 | 7 | 6 | 10 | 9 | 8 | 8.0 |
| 158. | M.Revanth | 7 | 8 | 6 | 9 | 9 | 9 | 8.0 |
| 159. | P.Sai Charan | 8 | 6 | 7 | 9 | 9 | 8 | 7.8 |
| 160. | E.Ravi Theja | 7 | 6 | 6 | 9 | 9 | 9 | 7.7 |
| 161. | T.Jaswanth Kumar | 6 | 7 | 7 | 9 | 8 | 9 | 7.7 |
| 162. | K.Krishna Chaithanya | 8 | 7 | 7 | 8 | 7 | 9 | 7.7 |
| 163. | R.Sai Sanjay | 8 | 7 | 8 | 8 | 8 | 7 | 7.7 |
| 164. | N.Saketh Ram | 6 | 8 | 7 | 9 | 7 | 9 | 7.7 |
| 165. | P.Sai Venkata dheeraj Kumar | 8 | 10 | 3 | 8 | 10 | 8 | 7.7 |
| 166. | S.Sravya Chowdary | 7 | 7 | 6 | 8 | 9 | 8 | 7.5 |
| 167. | P.Leela Karthik Reddy | 5 | 7 | 6 | 9 | 9 | 9 | 7.5 |
| 168. | N.Siva Jyothi | 8 | 7 | 5 | 8 | 8 | 9 | 7.5 |
| 169. | B.Achyuth | 7 | 6 | 4 | 10 | 8 | 9 | 7.3 |
| 170. | V.Hari Priya | 6 | 5 | 6 | 10 | 9 | 8 | 7.3 |
| 171. | Md.Sumayya Tamkeen | 7 | 8 | 5 | 9 | 8 | 7 | 7.3 |
| 172. | M.Nihil Mani Raj | 8 | 8 | 7 | 6 | 8 | 7 | 7.3 |
| 173. | M.Lakshmi Sai Deepak | 8 | 7 | 5 | 7 | 9 | 8 | 7.3 |
| 174. | P.Venkata Raghava | 8 | 4 | 7 | 9 | 8 | 8 | 7.3 |
| 175. | K.Mounica Sai | 7 | 9 | 4 | 7 | 9 | 8 | 7.3 |
| 176. | Ch. Pudheer Kumar | 7 | 7 | 5 | 7 | 8 | 9 | 7.2 |
| 177. | J.Ashik Yadav | 7 | 8 | 7 | 7 | 7 | 7 | 7.2 |
| 178. | Ch.Prudhvi Raj | 7 | 5 | 4 | 10 | 9 | 8 | 7.0 |
| 179. | E.Suresh Gopi | 9 | 8 | 5 | 5 | 7 | 8 | 7.0 |
| 180. | M.joharika | 6 | 6 | 7 | 9 | 9 | 5 | 7.0 |
| 181. | K.Sukesh Reddy | 5 | 6 | 7 | 10 | 7 | 7 | 7.0 |
| 182. | E.Saisuma | 8 | 7 | 5 | 7 | 7 | 8 | 7.0 |
| 183. | M.Lokesh Reddy | 5 | 6 | 7 | 9 | 7 | 8 | 7.0 |
| 184. | G.Yaswanth Kumar | 8 | 7 | 6 | 5 | 7 | 8 | 6.8 |
| 185. | V.Akhil | 6 | 7 | 7 | 6 | 8 | 7 | 6.8 |
| 186. | S.Sasidhar | 8 | 7 | 7 | 7 | 7 | 5 | 6.8 |
| 187. | B.Sundeep Reddy | 7 | 6 | 4 | 8 | 8 | 8 | 6.8 |

etc.,



**Smt M. Beulah Grace, B.Sc., B.Ed**
Head Mistress

**School Reopening on 6th June**

**P. Krishna Murthy M.Com.,**
Principal / Correspondent



నెల్లూరు మూలాపేటలో జరిగిన రోడ్ షోలో మాట్లాడుతున్న టిఎస్ఆర్.

● మీ ఓటుతో నాకవకాశమిస్తే

# నెల్లూరు డ్రైనేజి సమస్య తీరుస్తా!

నెల్లూరు నగరం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో అండర్ గ్రౌండ్ డ్రైనేజి ముఖ్యమైనది. ఎప్పుడో యాభై ఏళ్ల క్రితం అప్పటికి టౌన్ వున్న ప్రాంతంలో మాత్రమే అండర్ గ్రౌండ్ డ్రైనేజి వ్యవస్థ ఏర్పాటు చేశారు. ఆ తర్వాత నెల్లూరు నగరం పది రెట్లు పెరిగిపోయింది. పాత టౌన్‌లో కూడా ఇళ్ల స్థానంలో అపార్టుమెంట్లు వెలిశాయి. ఒక్క ఇల్లున్న చోట ఇప్పుడు పాతిక ముప్పై కుటుంబాలు కాపురాలు చేస్తున్నారు. శక్తి మించి పోవడంతో పాత డ్రైనేజి పనికి రాకుండా పోయింది. కొత్త ప్రాంతానికి అసలే లేదు. దానితో నెల్లూరు దోమల ఉత్పత్తికి కేంద్రంగా మారిపోయింది. పగలే పట్టి పీకుతున్నాయి. రాత్రి పూట నిద్ర కరవు. లేనిపోని రోగాలు. డెంగ్యూ, మలేరియా, ఫైలేరియా వంటి రోగాలలో నెల్లూరుకు దేశంలోనే ప్రథమ స్థానం వచ్చే దారుణ పరిస్థితి. ఈ దుర్గతి తొలగాలంటే అత్యవసరంగా నగరం మొత్తంలో అండర్ గ్రౌండ్ డ్రైనేజి వ్యవస్థ నిర్మాణం జరగాలి. కనీసం వెయ్యి కోట్ల రూపాయల ఖర్చుతో కూడిన పని అది. అంత సొత్తు రాష్ట్ర ప్రభుత్వం దగ్గర వుండదు. కేంద్రం ఇవ్వాలి. జవహర్‌లాల్ నెహ్రూ అర్బన్ ప్రణాళిక పథకం వంటి విభాగాల నుంచి మంజూరీ తెచ్చుకోవాలి. ఢిల్లీలో మాట చెల్లుబాటు అయ్యే వారితోనే అది సాధ్యం. ఆ పని నేను చేసి పెడతానని హామీ ఇస్తున్నాడు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి. మీ ఓటు ద్వారా నాకొక అవకాశం ఇవ్వండి, ఎన్నో ఏళ్లుగా మిమ్మల్ని వేధిస్తున్న డ్రైనేజి సమస్యను, దోమల శాపాన్ని తొలగింపచేస్తా అని మాట ఇచ్చారాయన.

బాలాజీనగర్, ఎసి నగర్, మసీదు సెంటర్, ఆదిత్య నగర్, రామ్‌జీ నగర్ తదితర ప్రాంతాలలో రోడ్డు షో నిర్వహించి, ప్రధాన కూడళ్లలో ప్రజలను కలిసి మాట్లాడిన సందర్భంగా ఈ డ్రైనేజి సమస్య ప్రస్తావనకు వచ్చింది. డ్రైనేజి వ్యవస్థ నిర్మాణంతో పాటు, నెల్లూరు నగరంలో పాతకాలం నాటి పంట కాలువలను శుభ్రం చేసి, వాటికి లైనింగ్ వేయించి, అవి మురుగు కాలువలుగా మారకుండా చూస్తాననీ మాట ఇచ్చాడు.

గతంలో ఇక్కడ ఎమ్పీలుగా పని చేసిన వారు ఏమి చేశారో, ఏమి చేయలేదో నాకు అనవసరం. ఒకరిని విమర్శించడం, తప్పు ఎన్నడం నా తత్వం కాదు. కానీ నేను మాత్రం, మీరు అవకాశం ఇస్తే, పది మంది ఎమ్పీల పెట్టున ఢిల్లీలో పనులు చేయించుకొని వస్తాను. నేరుగా ప్రధానితోనే మాట్లాడి నిధులు తెస్తాను... అన్నారు సుబ్బరామిరెడ్డి గారు. రాజకీయ గిమ్మిక్కులకు, తిట్లు శాపనార్థాలకు పాల్పడకుండా, ఎంతో పెద్ద మనిషి తత్వంతో సుబ్బరామిరెడ్డి గారు చేసిన ప్రసంగాలు నెల్లూరు పురజనులను విశేషంగా ఆకర్షించాయి. రాజకీయవాది అంటే ఇట్లా వుండాలని జనం తమలో తాము చర్చించుకొన్నారు, ఆయన ప్రసంగాల తీరు చూసిన వారు.

## తిక్కన మందిరానికి ప్రాణ ప్రతిష్ట

రంగనాయకుల పేటలోని తిక్కన మందిరాన్ని చూస్తే, రామాయణ కథలోని అహల్య జ్ఞాపకానికి వస్తుంది. శాపవశాత్తు రాయిగా మారిన గాథ తలపుకు వస్తుంది. సంవత్సరాలు, దశాబ్దాలు కాదు, కొన్ని తరాలుగా నిరాదరణకు గురౌతున్న చారిత్రక ప్రదేశం అది. ఎనిమిది వందలేళ్ల క్రితం అక్కడ కూర్చునే తిక్కన సోమయాజి మహా భారతంలోని 15 పర్వాలను తెలుగులో వ్రాశాడని ప్రతీతి. మహా భారతం వంటి ఉత్కృష్టమైన పౌరాణిక గ్రంధాన్ని పామరులకు కూడా సులభంగా అర్థమయ్యేట్లు వ్రాసిన ఘనుడాయన. ఆయనాపుణ్యం కట్టుకోకుంటే కురు పాండవుల గాథ సంస్కృత పండితులకు మాత్రమే పరిమితమై వుండేది. అంతటి మహానుభావుడికి నెల్లూరు నగరంలోనే కాదు, జిల్లాలో కూడా ఒక స్మారక చిహ్నం లేదు. స్మృతి ప్రదేశం లేదు. ఆయన అమృత హస్తాల నుంచి అక్షరాలు జాలు వారిన దివ్య మందిరాన్ని కూడా దారుణంగా నిర్లక్ష్యం చేశారింత కాలం. పరమ పవిత్రమైన దేవాలయం వలె భావించి, పూజించవలసిన మందిరాన్ని పాడు పెట్టారు. ఇన్నాళ్లు, ఇన్నేళ్లు పనికిరాని రాయి వలె పడి వుండిన తిక్కన మందిరానికి ప్రాణ ప్రతిష్ట చేసేం దుకు ముందుకు వచ్చారు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి గారు. తిక్కన అభిమాని శిరోమణి శర్మ ఆయన్ను మందిరానికి తీసుకవెళ్లి, దాని ప్రాశస్త్యాన్ని వివరించగానే, ఈ మందిరాన్ని ఒక పర్యాటక కేంద్రంగా, అంతర్జాతీయ సాహిత్యవేత్తల వేదికగా తీర్చిదిద్దుతా మని ప్రకటించారు. ఈ మందిరంలోకి అడుగు పెట్టగానే తనలో తెలియని అనుభూతులు కలిగాయని చెప్పారాయన.

సుబ్బరామిరెడ్డి మనసున్న మనిషి. సాహిత్యమన్నా, కళలన్నా, సంగీతమన్నా ఆయనకు ఎనలేని ప్రీతి. వాటి అభ్యున్నతి కోసం కృషి చేయడం తన జీవన విధానంగా మలచుకొంటున్నాడాయన. అందువల్లనే తిక్కన మందిరంపై అంతటి స్పందన చూపారాయన. ఇన్నేళ్లుగా నెల్లూరు జనం ఓట్లతో పదవులనుభవించిన రాజకీయ వేత్తలెవరికీ పట్టని చరిత్ర ప్రాముఖ్య అంశాన్ని తన భుజాల మీద వేసుకొన్నాడు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి. రామ పాదం తగిలి రాయి ఆడదైనట్లు, టిఎస్ఆర్ సంకల్పం ఫలించి తిక్కన మందిరం సాహిత్య క్షేత్రంగా ప్రాణం పోసుకొంటుందని ఆశిద్దాం.



ఉదయగిరిలో జరిగిన సభలో ప్రజలకు అభివాదం చేస్తున్న తిక్కవరపు సుబ్బరామిరెడ్డి.

# ఫ్లోరిన్ సమస్యకు పరిష్కారం!

ఏ జన్మలో చేసిన పాపమో, ఏ ముని పుంగవుడిచ్చిన శాపమో తెలియదు కానీ పాడి పంటలకు నిలయంగా విలసిల్లే నెల్లూరు జిల్లాలో భాగమైన ఉదయగిరి ప్రాంతం అభివృద్ధిలో ఆరు జన్మల అంతరంతో వెనుకబడి వుంది. లెక్క లేనన్ని సమస్యలతో సతమతమౌతున్నది. వాటిలో అత్యంత ప్రాధాన్యమైనది – ఫ్లోరిన్ సమస్య. వానలు సరిగా పడక, భూగర్భ జలాలు ఫ్లోరిన్‌తో కలుషితం కావడంతో అవి త్రాగే వారికి, మరీ ముఖ్యంగా పలు రకాల ఆరోగ్య సమస్యలు వస్తున్నాయి. ఫ్లోరోసిస్ వ్యాధి అత్యంత ప్రమాదకరమైనది. అది సోకినవారు జీవచ్ఛవాల మాదిరి మారి పోతారు. దానికి సరైన చికిత్స కూడా లేదు. ఎన్నో ఏళ్లుగా ఉదయగిరిని పీడిస్తున్న ఈ సమస్యను పరిష్కరించడానికి కేంద్ర ప్రభుత్వం నుంచి నిధులు తెచ్చి, ఆరోగ్యకరమైన మంచినీటి వసతి కల్పిస్తానని హామీ ఇచ్చారు నెల్లూరు నియోజకవర్గం కాంగ్రెస్ అభ్యర్థి తిక్కవరపు సుబ్బరామిరెడ్డి. ఉదయగిరి ప్రజల నుంచి ఓట్లు దండుకొని పోవడం తప్ప ఇంతకాలం ఈ సమస్యను ఎవరూ పట్టించుకోలేదు. ఫ్లోరోసిస్ వ్యాధిగ్రస్తులైన అభాగ్య జీవులను ఆదుకొన్న వారే లేరు. ఇన్నాళ్లకు సుబ్బరామిరెడ్డి ఈ సమస్యపై మనసుపెట్టాడు. ఢిల్లీలో ఆయనకున్న పలుకుబడి రీత్యా చూస్తే సుబ్బరామిరెడ్డికి ఇది పెద్ద పని కాదు.

ఉదయగిరిలో జరిగిన ప్రచార సభలో ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి పాల్గొన్నారు. జగన్‌తో ఆర్థిక లావాదేవీలు వున్నందువల్ల ఇక్కడ గతంలో ఎమ్పీగా గెలిచిన మేకపాటి రాజమోహన్ రెడ్డి పార్టీ ఫిరాయించాడని, ఈ ఎన్నికలు అకారణంగా జనం నెత్తిన రుద్దాడని, లక్ష కోట్ల రూపాయల ప్రజాధనాన్ని లూటీ చేసిన జగన్ పక్కన చేరి, మరింత దోపిడీకి పాల్పడడానికే మేకపాటి రాజమోహన్‌రెడ్డి ఎన్నికలలో పోటీ చేస్తున్నాడని ఘాటుగా విమర్శించాడు రామనారాయణరెడ్డి.

## తులసి మొక్కలు పంచమని సుబ్బరామిరెడ్డికి సలహా !

ఉదయగిరిని పీడిస్తున్న ఫ్లోరిన్ కలుషిత నీటి సమస్యను నివారించడానికి తిక్కవరపు సుబ్బరామిరెడ్డి సంకల్పం వహించడం పట్ల, ప్రఖ్యాత ఇంజనీరు, తొంభైఏళ్ల వయస్సులోనూ ప్రజా సమస్యల మీద స్పందన చూపే మేధావి తిక్కవరపు కోదండ రామరెడ్డి అభినందనలు తెలియజేశాడు.

ఫ్లోరిన్ నీటి సమస్య దేశంలోచాలా చోట్ల ప్రజలను బాధిస్తున్నది. ప్రభుత్వాలు ఈ విషయంలో పెద్దగా చేసింది ఏదీ కన్పించడం లేదు. ఈ ఫ్లోరిన్ కలుషిత నీళ్లు త్రాగితే వచ్చే ఫ్లోరోసిస్ వ్యాధి మహా దారుణమైనది. వ్యాధి వచ్చిన తర్వాత దాన్ని కుదిర్చే వైద్యం లేదు.

అయితే మహారాష్ట్రలోని చంద్రాపూర్ సర్దార్ పటేల్ మహా విద్యాలయం శాస్త్రవేత్తలు దీనిపై విస్తృత పరిశోధనలు చేసి, సులభమైన నివారణ ఉపాయం కనిపెట్టారు. తులసి ఆకులను, రెమ్మలను ఫ్లోరిన్ కలిసిన నీటిలో ఇరవై నిముషాల పాటు నాన పెడితే, ఆ నీళ్లలో ఫ్లోరిన్ సమస్య బాగా తగ్గిపోతుందని వారి పరిశోధనలు తేల్చాయి. బహుశా అందువల్లనే కాబోలు మన పెద్దవాళ్లు ప్రతి ఇంట్లో ఒక తులసి చెట్టు పెంచేవారు. ప్రభుత్వంతో పని లేకుండా, ఎవరికి వారు పరిష్కరించుకోగల్గిన పద్ధతి ఇది.

"సుబ్బరామిరెడ్డి గతంలో విశాఖపట్నం వాసులకు 50వేల తులసి మొక్కలు ఉచితంగా పంచి పెట్టినట్లు పత్రికలలో చదివాను. ఎన్నికలు ముగిసిన తర్వాత ఉదయగిరిలో కూడా ఆయన ఈ సత్కార్యం చేపట్టాలి. ప్రతి ఇంటికీ ఒక తులసి మొక్క ఇచ్చి, దాని ప్రాధాన్యతను వివరించి చెప్పాలని ఆయనకు నా సలహా" అన్నారు టికె.రెడ్డి. సుబ్బరామిరెడ్డి గారు పాటించదగిన సలహా ఇది.

**● సుబ్బరామిరెడ్డిని గెలిపించుకొంటే**

# మన పిల్లలందరికీ ఉద్యోగాలు!

ప్రజాస్వామ్యంలో శాసనాల ద్వారా ప్రజల తలవ్రాతలు వ్రాసే చట్టసభ – పార్లమెంట్. అందులో సభ్యుడిగా వున్నవాడు ప్రజాహితం కోరేవాడైతేనే ప్రజలకు ప్రయోజనం. పార్లమెంట్ సభ్యుడికి స్థాయి వుండాలి. విద్య కావాలి. వివేకం వుండాలి. చొరవ చూపాలి. చురుకుదనం ప్రదర్శించాలి. భాషా పరిజ్ఞానం తప్పనిసరి. ఉన్నతాధికారులతో పరిచయం పెంచుకోవాలి. ఉన్నత స్థానాలలో వున్న వారితో స్నేహం పాటించాలి. ఈ అర్హతలన్నీ వున్నవాడు పార్లమెంట్‌కు వెళ్తే, ఆ నియోజకవర్గం ప్రజల పంట పండినట్లే. ఇవన్నీ అవసరానికి మించి వున్నవాడు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి. పార్లమెంట్‌లో ఆయన కదలికలు పాదరసాన్ని తలపింప చేస్తుంటాయి. ఆయన పిలిస్తే ప్రధాని పలుకుతాడు. ఆయన చెప్తే కేంద్రమంత్రులు ఓపికగా వింటారు. ఆయన కోరితే కేంద్ర ప్రభుత్వ అధికారులు పనులు చేసి పెడతారు. నిధులిస్తారు. పథకాలు మంజూరు చేస్తారు. విశాఖపట్నం ప్రజలకు ఈ నిజాలు తెలుసు. విశాఖ ఎమ్పీగా ఆయన బెస్ట్ పార్లమెంటేరియన్ అవార్డు పొందాడు. దాన్నిబట్టే పార్లమెంట్‌లో ఎంత చురుకుగా వ్యవహరించిందీ అర్ధం చేసుకోవచ్చు. ఆ చొరవ, ఆ చురుకుదనం విశాఖ నగరానికి ఎంతో మేలు చేశాయి. మూతపడిన బిహెచ్‌పివి పరిశ్రమ, లాభాల మూటలతో నిండుగా వుండే బిహెచ్‌ఇఎల్‌లో విలీనం అయ్యింది. దాదాపు 20 వేల మంది కార్మికులకు పోయిందనుకొన్న ఉపాధి మళ్లీ లభించింది. సుబ్బరామిరెడ్డి పట్టుదల వల్లనే ఖాయిలాపడిన హిందూస్తాన్ షిప్‌యార్డ్ పునరుజ్జీవం చెందింది. ప్రధాని మన్మోహన్ సింగ్‌ను విశాఖకు రప్పించి, స్వయంగా షిప్‌యార్డ్‌ను చూపించి, దాని పునరుద్ధరణ అవసరాన్ని వివరించి చెప్పడంతో ఒక్క కలం పోటుతో ప్రాణ ప్రతిష్ట జరిగిపోయింది. ఆ పరిశ్రమలో దాదాపు పాతిక వేల మందికి ఉద్యోగాలు నిలిచాయి. ఇందిరమ్మ చేతుల మీదుగా జీవం నింపుకొన్న విశాఖ ఉక్కు కర్మాగారం ఉత్పత్తి సామర్థ్యం రెట్టింపు చేయించిన ఘనత కూడా సుబ్బరామిరెడ్డి గారిదే. దానివల్ల విశాఖ నగరానికి జరిగిన మేలు అంతా ఇంతా కాదు. ఈ రోజు విశాఖ ఉక్కు దేశంలోని అన్ని ఉక్కు కర్మాగారాలలోకి అగ్రగామిగా నిలుస్తున్నది. విశాఖ ఎయిర్‌పోర్టును అంతర్జాతీయ విమానాల రాకపోకలకు అనువుగా ఆధునీకరించినవాడు సుబ్బరామిరెడ్డి. దానివల్ల దుబాయ్, అమెరికా వంటి దూర ప్రాంతాలలో వుండే తమ పిల్లలను చూడడానికి వెళ్లే తల్లిదండ్రులకు ఎంతో సౌకర్యం కల్గింది. వారంతా విమానం ఎక్కే ప్రతిసారీ సుబ్బరామిరెడ్డి పేరు తలచుకొంటూ వుంటారు. అంతకు క్రితం ఈ దేశాలకు వెళ్లాలంటే హైదరాబాదుకో, మద్రాసుకో వెళ్లవలసి వచ్చేది. ఎంతో ప్రయాస, చీకాకు. ఇప్పుడంతా సుఖం.

పార్లమెంట్ సభ్యుడు తలచుకొంటే, ఆయన ప్రాతినిధ్యం వహించే ప్రాంతాలలో అభివృద్ధి అంత వేగంగా వుంటుంది. అంత సమగ్రంగా వుంటుంది. పారిశ్రామికంగా అభివృద్ధి అనే పదానికి నోచుకోని అభాగ్య నగరం నెల్లూరు. ఇంతకాలం ఇక్కడ నుంచి ఎమ్పీలుగా ఎన్నికైన వారికి ఢిల్లీ దారులు తెలియవు. ఉన్నత స్థానాలలోని వ్యక్తులతో, నేతలతో, అధికారులతో మాట్లాడడానికి ఇంటర్వ్యూ కూడా దొరికేది కాదు. అందువల్లనే ఏ ఒక్క ఎమ్పీ కూడా ఏ ఒక్క ప్రాజెక్ట్ తేలేకపోయాడు. ఏ ఒక్క పథకాన్నీ నెల్లూరుకు కేటాయింప చేయలేకపోయాడు. ఈ కొరత తీరాలంటే, మన నెల్లూరు బాగుపడాలంటే, మన పిల్లలకు ఉద్యోగాలు దొరకాలంటే, ఇక్కడా ఫ్యాక్టరీ సైరన్ కూతల కమ్మటి ధ్వని వినాలంటే తిక్కవరపు సుబ్బరామిరెడ్డిని మన ఎమ్పీగా ఢిల్లీకి పంపడమొక్కటే మార్గం. అరుదుగా దొరికిన ఈ అవకాశాన్ని వినియోగించుకోవడం, భవిష్యత్తు మీద ఆశ వున్న ప్రతి ఒక్కరూ తమ ఓటును కాంగ్రెస్ గుర్తు మీదనే వేయడం అవసరం.



కనుపర్తిపాడు రోడ్డు షోలో మాట్లాడుతున్న టిఎస్ఆర్. ప్రక్కన రాజ్యసభ సభ్యురాలు రేణుకా చౌదరి, ఆనం విజయ.

నెల్లూరు లోక్‌సభ నియోజకవర్గం ఉప ఎన్నికలలో ఎవరికి మద్దతు ఇస్తే మేలు, ఎవరికి ఓటు చేస్తే ప్రయోజనం అనే చర్చ జరిపారు కొందరు నెల్లూరు పుర ప్రముఖులు. వివిధ ప్రభుత్వ విభాగాలలో ఉన్నతస్థాయిలో రిటైర్ అయిన అధికారులు, హైదరాబాదులో ప్రముఖంగా వెలుగొందుతున్న న్యాయవాదులు, పాత్రికేయులు వంటి వారితో కూడిన సమావేశం ఇది. ఆ సమావేశంలో వ్యక్తమైన అభిప్రాయమే.... పైన చెప్పినది.



నెల్లూరులో జరిగిన సభలో కేంద్రమంత్రి గులాంనబీ అజాద్, సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి, చిరంజీవి, బొత్సా, రామనారాయణరెడ్డిలతో కలిసి ప్రజలకు అభివాదం చేస్తున్న టిఎస్ఆర్.

ఓటు వేసే ప్రతివాడూ పార్టీల మంచి చెడులతో పాటు, అభ్యర్ధుల గుణగణాలను కూడా పరిగణనలోకి తీసుకోవాలని మేధావులందరూ అభిప్రాయపడ్డారు. ఆ కోణంలో చూస్తే ఇప్పుడు నెల్లూరులో పోటీ చేస్తున్న అభ్యర్ధులందరిలో తిక్కవరపు సుబ్బరామిరెడ్డిని గెలిపించుకోవడమే నెల్లూరు జిల్లాకు శ్రేయస్కరమని తీర్మానించారు.

## శాలివాహనుల సమర్ధన

నెల్లూరు లోక్‌సభ నియోజకవర్గం నుంచి కాంగ్రెస్ అభ్యర్ధిగా పోటీ చేస్తున్న తిక్కవరపు సుబ్బరామిరెడ్డికి తమ సంపూర్ణ మద్దతు వుంటుందని శాలివాహన సంఘం నేతలు ప్రకటించారు. ఆయన గెలుపు కోసం తమ సంఘం కృషి చేస్తున్నదని చెప్పారు. టిఎస్ఆర్ కార్యాలయంలో జరిగిన శాలివాహన సంఘం సమావేశంలో అధ్యక్షుడు కెఎస్. నరసయ్య, ప్రధానకార్యదర్శి పెళ్లూరు శ్రీనివాసులు, కోశాధికారి మాలెపాటి మాల్యాద్రి, గౌరవ అధ్యక్షుడు యడవల్లి పెంచలయ్య, ఉపాధ్యక్షుడు మన్నేపల్లి తిరుపయ్య, అసోసియేట్ అధ్యక్షుడు ఎం.నాగేశ్వరరావు, సలహాదారుల సంఘం అధ్యక్షుడు మన్నేపల్లి వెంకటరమణయ్య తదితరులు పాల్గొన్నారు.

## మంచి పనులే ముఖ్యం రాజకీయం ఆ తర్వాత...

కుల మతాలకు, రాజకీయాలకు అతీతంగా మంచి పనులు చేయడమే తన అభిమతమని ప్రకటించారు తిక్కవరపు సుబ్బరామిరెడ్డి. జిల్లా రేషన్ డీలర్ల సదస్సులో మాట్లాడుతూ, మంచి పనులు చేయడానికి ఏదీ అడ్డంకి కారాదని అభిలషించారు. రేషన్ డీలర్ల సమస్యల పరిష్కారానికి ముఖ్యమంత్రితో మాట్లాడుతానని హామీ ఇచ్చారు. సంఘం అధ్యక్షుడు మునగా గిరిజారావు, కార్యదర్శి బి.మాల్యాద్రి, ఎ.రవికుమార్, ఆర్గనైజింగ్ కార్యదర్శి ఎస్.నాగరాజు తదితరులు పాల్గొన్నారు.



బుజబుజ నెల్లూరులో టిఎస్ఆర్‌కు షేక్‌హ్యాండ్ ఇవ్వను పోటీపడుతున్న మహిళలు.

## జగన్‌కు ఎందుకు ఓటు వేయాలి?

5వ పేజీ కొరవ

వడ్డీకి అప్పులిచ్చాడు. రైతుల రుణాలు రద్దు చేశాడు. ఉచిత విద్యుత్ ఇచ్చాడు. ఇళ్లు కట్టించాడు. భూముల ధరలు పెంచాడు. విద్యార్థుల ఫీజులు తిరిగి చెల్లించాడు. మైనార్టీలకు రిజర్వేషన్లు కల్పించాడు. ఆయనున్న కాలంలో వడ్లకు గిట్టుబాటు ధర పలికింది. అందువల్ల ఆయనంటే మాకు అభిమానం, ఆయన కొడుకుగా జగన్ అంటే ప్రేమ అంటున్నారు జనం.

## వైఎస్‌కు ఎందుకు ఓటెయ్యలేదు?

అన్ని ఉపకారాలు చేసిన రాజశేఖర్‌రెడ్డి మీద నిజంగా జనానికి ప్రేమ వుంటే, ఆయనున్నప్పుడే జరిగిన ఎన్నికలలో ఆయనకు ఓటు వేయడానికి జనానికి చేతులెందుకు రాలేదు? 200 సీట్లున్న కాంగ్రెస్ పార్టీని 150 స్థానాలకు ఎందుకు దిగజార్చారు. లోక్‌సత్తా వల్లనో, ప్రజారాజ్యం పుణ్యానో చావు తప్పి కన్ను లొట్టపోయినట్లు మళ్లీ ముఖ్యమంత్రి అయ్యాడే తప్ప, నిజమైన గెలుపు కాదది. ఆ వాస్తవాన్ని రాజశేఖర్‌రెడ్డి గారే అంగీకరించారు. తనను ప్రజలు అనుకొన్న రీతిలో ఆరాధించలేదని బహిరంగంగానే అసంతృప్తి వ్యక్తం చేశారు. ఈ లోపానికి కారణం ఏమిటో ఆత్మవిమర్శ చేసుకోవాలని సిఎల్పీ సమావేశంలో ఎమ్మెల్యేలకు హిత బోధ చేశాడు. జనానికి రాజశేఖర్‌రెడ్డి మీద నిజమైన ప్రేమ లేదని ఆ ఎన్నికల ఫలితాలు తిరుగులేకుండా నిరూపించాయి. బర్రె చనిపోయిన తర్వాత పాడి బయట పడినట్లు, రాజశేఖర్‌రెడ్డి మరణం తర్వాతనే ఆయన మీద ప్రజలలో సానుభూతి పెల్లుబికింది. కానీ ఇది ఆంధ్ర ప్రాంతానికి మాత్రమే పరిమితం. ఈ రెండేళ్లలో తెలంగాణ జిల్లాలలో జరిగిన ఏ ఎన్నికలోనూ ఇదే జనం జగన్‌ను కానీ, ఆయన పార్టీని కానీ పట్టించుకోలేదు. వైఎస్ మీద సానుభూతి వ్యక్తం చేయలేదు. తెలంగాణ ఏర్పాటు మీద ప్రజలలో వున్న ప్రబలమైన ఆకాంక్ష అన్ని సానుభూతులనూ పక్కకు నెడుతున్నది.

### ఆంధ్రాలోనే ఆదరణ

ఆంధ్ర ప్రాంతంలో మాత్రమే జగన్ మీద ప్రేమ ప్రవహిస్తున్నది. కడప లోక్‌సభ ఎన్నిక, ఆ తర్వాత జరిగిన కోవూరు శాసనసభ ఉపఎన్నిక అందుకు ఉదాహరణ. ఇప్పుడు జరుగుతున్న ఉప ఎన్నికలూ అదే బాటలో పయనించనున్నాయని అన్ని సర్వేలూ స్పష్టం చేస్తున్నాయి. ఎందువల్ల ఈ పరిస్థితి?

జగన్ అవినీతిపరుడన్న నిజం అందరికీ తెలుసు. ప్రజలు రాజకీయ అవినీతిని సహిస్తారను కోవడానికి లేదు. అవినీతి వల్లనే సుఖ్‌రాం జైలుకు వెళ్లాడు. జయలలిత ఇంటికి వెళ్లింది. లల్లూప్రసాద్ పదవి పూడింది. కరుణానిధి మంచం పట్టాడు. అవినీతికి పాల్పడిన రాజకీయవాదులను, పార్టీలను ప్రజలు కఠినంగా శిక్షిస్తారని చెప్పడానికి రాజీవ్ గాంధీ ఉదంతం ఒక్కటే ఉదాహరణ. 60 కోట్ల కుంభకోణంలో రాజీవ్‌గాంధీ ప్రమేయం వుందన్న నెపానికి, ఆయన మరణం తర్వాత కూడా ప్రజలు కాంగ్రెస్‌ను క్షమించలేదు. లోక్‌సభలో 400 సీట్ల నుంచి 190 సీట్లకు దిగజార్చి వేశారు. కానీ లక్ష కోట్లు దోచుకొన్నాడనే ఆరోపణ, సిబిఐ దర్యాప్తుకు, న్యాయస్థానాల విచారణకు, అరెస్టుకు చేరుకొన్నా కూడా జనం జగన్‌ని ఆరాధిస్తున్నారు. ఏమిటీ విచిత్రం? ప్రజలలో వివేచనా శక్తి లోపించిందా? రాజకీయ వ్యవస్థ మీద విశ్వాసం నశించిందా? ప్రజలను అంత వివేకశూన్యులుగా భావించడమూ సహేతుకం కాదు. అనామకుడైన అన్నాహజారే అవినీతిపై యుద్ధం ప్రకటించగానే యావత్ జాతి, అగ్నిపర్వతం బద్దలైనట్లుగా స్పందన చూపింది. వేల సంఖ్యలో యువతీ యువకులు వీధులలోకి వచ్చారు. బాసటగా నిలబడ్డారు. ట్విట్టర్, ఫేస్‌బుక్, బ్లాగ్ వంటి ఇంటర్నెట్ వేదికలలో చదువుకొన్న యువతరం తమ అభిప్రాయాలను కుండబద్దలు కొట్టింది. విచిత్రంగా అదే యువతరం, అదే విద్యావంతుల వర్గం ఇప్పుడు జగన్‌కు జై కొడుతున్నది.

### జగన్ అవినీతికి ఆధారాలు

జగన్ అవినీతికి ఆరోపణలు తప్ప ఆధారాలు లేవా అంటే, కుప్ప తెప్పలుగా వున్నాయి. జనం కళ్ల ఎదుటే వున్నాయి. బెంగుళూరులో 22 ఎకరాల విస్తీర్ణంలో ఇల్లు కట్టుకొన్నాడు జగన్. దానికైన ఖర్చు 500 కోట్ల రూపాయల పై మాటే. దాని లోపలి అలంకరణలు నిజాం ప్యాలెస్‌లో కూడా చూడలేము. బాత్‌రూం సైజు మధ్యతరగతి వారు నివసించే అపార్టుమెంట్ కంటే పెద్దది. కొళాయిలు, తలుపు గెడుల వంటి వాటికి బంగారు పూత పూసి వుంటుంది. నరమానవుడెవడూ అనుమతి లేకుండా అందులోకి ప్రవేశించలేడు. హైదరాబాదులో నిర్మించుకొన్న ఇల్లు కూడా దీనికి ఏ మాత్రం తీసిపోదు. ఎకరమన్నర స్థలంలో కట్టారు దాన్ని. హైదరాబాదులో, విలాసవంతమైన జూబ్లీహిల్స్ ప్రాంతంలో ఎకరమన్నర విస్తీర్ణంలో ఇల్లు అంటే గొప్ప గొప్ప సంపన్నులకు కూడా అలవి కాని పని. బెంగుళూరులో 400కోట్ల విలువ చేసే కమర్షియల్ భవంతి వుంది. సాక్షి పత్రికకు ఇప్పటి వరకు ఆయన పెట్టిన ఖర్చు 800 కోట్ల పైమాటే. ఆరేళ్ల క్రితం స్వంత ఇల్లు అమ్ముకొని అప్పులు కట్టుకోవడానికి ప్రయత్నించిన కుటుంబానికి ఇంత సంపద ఎట్లా వస్తుంది? ఆ మాత్రం ఆలోచన చేయలేని అమాయకులా జనం?

### నేర చరిత్ర ఉంది

పోనీ జగన్ కేవలం అవినీతి పరుడు మాత్రమేనా అంటే, కాదు. ఆయనకు నేర చరిత్ర కూడా వుంది. కడప జిల్లాలో ఎవరిని కదిలించినా జగన్‌కు సంబంధం వున్న ఫ్యాక్షన్ హత్యలను, నేరాలను, సెటిల్‌మెంట్లను, బెదిరింపులను భయపెట్టడాలను కోకొల్లలుగా ఉదహరిస్తున్నారు. మంగలి కృష్ణతో సంబంధాలు, పరిటాల రవి హత్యలో ప్రమేయం, భాను కిరణ్ దుర్మార్గాలలో పాత్ర వంటి ఆరోపణలు లెక్కలేనన్ని వున్నాయి. అంతటి నేర చరిత్ర కల్గిన వాడిని మామూలుగా అయితే సమాజం వెలివేస్తుంది. ఒక రాజకీయ నేతగా మాత్రమే కాదు, సాధారణ గౌరవానికి కూడా అర్హత లేకుండా చూస్తుంది. కానీ జగన్ విషయంలో జనం ఈ నేర చరిత్రను కూడా విస్మరిస్తున్నారు.

ప్రజాస్వామ్య స్ఫూర్తిని సమూలంగా హననం చేసే ఈ హేయమైన దురభిమానం దేనివల్ల అన్నది ప్రశ్న. మరణించినవారు, ఎంత దుర్మార్గులైనా, దుష్టులైనా సానుభూతి చూపడం హైందవ సమాజ సాంప్రదాయం. రాజశేఖర్‌రెడ్డి మీద ప్రేమకు అదొక కారణం కావచ్చు. అంతకంటే బలీయమైన కారణం – ప్రభుత్వం మీద ప్రజలలో పెరుగుతున్న అసహనానికి, అసహ్యానికి, ద్వేషానికి ఉపశమనం జగన్ పార్టీలోనే లభించడం కావచ్చు. గత రెండేళ్లలో అన్ని వస్తువుల ధరలూ పెరిగి పోయాయి. వ్యవసాయం గిట్టుబాటు కాకుండా పోయింది. రియల్ ఎస్టేట్ వ్యాపారం కుప్పకూలింది. దానితో భూములు అమ్ముదామంటే కొనే దిక్కు లేదు. వానలు పడడం లేదు. కరెంట్ కోత తీవ్రంగా వుంది. పల్లెల్లో నిత్య జీవనం దుర్భరంగా మారుతున్నది. ఎద్దు పుండు కాకికి రుచి అన్నట్లు, కొత్తగా పెట్రోల్ ధర పెంచాడు మన్మోహన్ సింగ్. అది జనానికి మరీ కడుపు మండిస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వం తీరు పరమ దుస్సహంగా వుంది. ముఖ్యమంత్రిలో నాయకత్వ లక్షణాలు లేవు. ఆయన మంత్రులు ఎందుకూ కొరగాని వారి వలె వ్యవహరిస్తున్నారు. మద్యం కుంభకోణాల వంటివి పార్టీ పరువు తీస్తున్నాయి. పార్టీ కార్యకర్తలలో నిరాశ, నిరుత్సాహం తాండవిస్తున్నాయి. అధికారంలో వున్న వారు తమ ఇల్లు చక్కబెట్టుకోవడానికి చూపుతున్న శ్రద్ధ కార్యకర్తల శ్రేయస్సుకు చూపడం లేదు. గత ఎనిమిదేళ్లుగా కాంగ్రెస్‌వాదులకు ఒక్క పదవీ రాలేదు. రాజశేఖర్‌రెడ్డి, రోశయ్య, కిరణ్‌కుమార్‌రెడ్డి కార్పొరేషన్ పదవుల నియామకాన్ని నిరవధికంగా వాయిదా వేశారు. దానితో కాంగ్రెస్ కార్యకర్తలందరిలోనూ ఆసక్తి చచ్చిపోయింది. ఎమ్మెల్యేలు కోట్లు దోచుకొంటున్నారు. వారిలో అహంకారం అవధులు మీరుతున్నది. అధికార యంత్రాంగాన్ని తమ దుర్మార్గాలకు దుర్వినియోగం చేస్తున్నారు. ఆ పోకడను కట్టడి చేసే సామర్థ్యం ముఖ్యమంత్రులకు లేకుండా పోతున్నది. వీటన్నిటితో కాంగ్రెస్ అన్నా, కాంగ్రెస్ ప్రభుత్వం అన్నా ప్రజలలో వ్యతిరేక భావమే కాదు, ద్వేషభావం పెరుగుతున్నది.

సహజంగా అయితే ఈ యాంటీ ఇన్‌కంబెన్సీ వాతావరణాన్ని ప్రతిపక్షమైన తెలుగుదేశం వాడుకోవాలి. కానీ తెలంగాణ విషయంలో వూగిసలాడి, జగన్ విషయంలో చూపుతున్న అత్యుత్సాహం వల్ల చంద్రబాబు ప్రజల దృష్టిని ఆకర్షించలేక పోతున్నాడు. ఆ పార్టీ మీద పూర్వపు విశ్వాసం కలగడం లేదు. ఈ వాతావరణం జగన్‌కు దేముడిచ్చిన వరం వలె ఉపకరిస్తున్నది. ఆయనెంత దుర్మార్గుడైనా, అవినీతిపరుడైనా, నేర చరిత్ర కల్గిన వాడైనా, అనుభవ శూన్యుడైనా, కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయం తానే అనే నిరూపణ చేసుకోగల్గుతున్నాడు. అందువల్లనే మనసులలో ఎంత గిలి వున్నా, జనం జగన్‌ను ఆరాధిస్తున్నారు. ఓటు చేస్తామని నిర్భయంగా, నిర్మొగమాటంగా చెప్తున్నారు. కారణం ఏదైనా, పరిస్థితులు ఎటువంటి వైనా, ప్రోద్బలం ఎక్కడ నుంచి వచ్చినా ఒక అవి నీతి పరుడికి, నేర చరిత్రుడికి ఇంతటి జనాదరణ, ఎన్నికలలో విజయం అనేవి ప్రజాస్వామ్యానికి శరాఘాతం వంటిదని చెప్పక తప్పదు. రాజకీయాలలో నీతిని, సచ్ఛీలతను ఆశించే వారికి ఈ పరిణామాలు మనోవేదన కల్గిస్తున్నాయి.

**–దోలేంద్ర**

# త్రిశాలా నిర్మాణం వంశ హానికరం!

వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి

4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు–4.

ఫోన్: 2322345, సెల్: 9490125878.

*కె.రంగన్నగౌడ్ — కర్నూలు*

** శాల, లేక వరండాలు మా యింట మూడు ఉన్నవి? పెద్దన్న మరణించారు.*

తూర్పు, ఉత్తరాలలో శాలలు, వరండాలు అభ్యంతరం లేదు. మూడవ శాల నిర్మాణం పశ్చిమ, దక్షిణాల్లో జరుగకూడదు. ఈ అవాస్తును 'దంష్ట్ర' మని విశ్వకర్మ ప్రకాశిక చెబుతున్నది. మరణం, అనారోగ్యం కలుగుతాయి.

*కదిరి నారాయణప్ప — కర్నూలు*

** ఇల్లు నైరుతి పెరిగింది. వాయువ్య ప్రవేశం. పరిష్కారం చెప్పండి?*

ద్వారం ఈశాన్యం వైపు మార్చి ఆరు మాసాలు చూడండి. సుదర్శన యంత్రం ఇప్పుడున్న పరిస్థితుల నుంచి రక్షణ ఇస్తుంది.

*జి.వి.అరుణ — బెంగుళూరు*

** మెట్లు 'ప్లాటు'కు ఎదురుగా, లిఫ్టు ప్రక్కగా రావచ్చునా?*

రాకూడదు. ఇంటికి 'దిష్టివేధ' తగులుతుంది. ఇంటి ముందు చెక్క స్టాండు ఏర్పాటు చేసుకొని 'దృష్టివాస్తు' యంత్ర ప్రతిష్ట చేసుకోండి.

*కె.పి.ఎన్ — గూడూరు*

** కోడలు జాతకం బాగోలేదనిపిస్తోంది. పైగా ఆ పిల్ల నలుపు. వర్జాలు కూడా చెడు చేస్తాయా?*

మీరు ఒక అమ్మ కన్న బిడ్డేనా? నాకు అనుమానం వేస్తోంది. జాతకం బాగలేదన్నది అపవాదు. ఆమెదిప్పుడు గురు మహర్దశ. నలుపు కోడలు ఇంటికి అరిష్టమన్నాక మీ మానసిక ఆరోగ్యం గూర్చి అనుమానం వేస్తోంది.

*కె.వి.రమామణి — శ్రీశైలం*

** గెల వేసిన అరటి తీయడం మంచిదికాదా?*

ఫలించిన చెట్టు గర్భిణీ సమానం అంటున్నాయి శాస్త్రాలు. స్త్రీ, శిశు హత్యాపాతకమని 'ధర్మసింధు' గ్రంథం చెబుతోంది.

*ఆర్వేల అనంతాచార్యులు — తిరువత్తూరు*

** శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం రచించిన వారెవరు? వారెప్పుడు జీవించారు?*

స్వామి సుప్రభాతాన్ని క్రీ.శ 1361 – 1454 వరకూ జీవించిన ప్రతివాది భయంకర అణ్ణన్ రచించారు. వీరు మణవాళ మహాముని ప్రధాన శిష్యులు.

*ఉంగూరు సీతాలక్ష్మి — సికింద్రాబాద్*

** శుక్రవారం 'తులసి దళం' కోయకూడదా? పూజ కొన్ని రోజులు చేయకపోతే అపచారమా?*

పూజ నిమిత్తం కొద్దిపాటి 'దళాలు' ఎప్పుడైనా కోయవచ్చు. పూజ చేయని రోజులు లెక్కించి అన్ని గుంజిళ్లు తీసి క్షమాపణ కోరమని 'కశ్యప సంహిత' చెబుతోంది.

*పరిదివి రమణయ్య — గుంటూరు*

** చదువు ఆగిపోయింది. వ్యాపారంలో సమస్యలు. ఎందుకూ పనికి రాకుండా పోతున్నాడు.*

తూర్పు దోషాలు మగపిల్లలపై పనిచేస్తాయి. వాటిని పరిష్కరించండి. అతనికి గోమేధుకం(శ్రేష్ఠ) కుడి చిటికెన వ్రేలికి ధరింపజేయండి.

# ఆరోగ్యశ్రీ ఉందా... లేదా?

పేద ప్రజలు కార్పొరేట్ ఆసుపత్రుల్లో ఉచిత వైద్యం, శస్త్రచికిత్సలు చేయించుకొనేందుకు ప్రవేశపెట్టిన రాజీవ్ ఆరోగ్యశ్రీపై అధికారులు, ప్రభుత్వం పొంతనలేని ప్రకటనలు చేస్తున్నారు.

పేద ప్రజలకు కార్పొరేట్ ఆసుపత్రుల్లో ఉచిత వైద్యం, శస్త్రచికిత్సలు చేయించుకునేందుకు ప్రవేశపెట్టిన రాజీవ్ ఆరోగ్యశ్రీపై అధికారులు, ప్రభుత్వం పొంతన లేని ప్రకటనలు చేస్తున్నారు. గతంలో మాదిరిగా ప్రస్తుతం ఆరోగ్యశ్రీ కార్డులను కార్పొరేట్ ఆసుపత్రుల్లో అనుమతించడం లేదు. ఇందుకు కారణం ఆరోగ్యశ్రీ ట్రస్టు నుంచి అనధికారిక ఉత్తర్వులు వెలువడడమే. ప్రమాదాల్లో గాయపడిన వారికి శస్త్రచికిత్స చేయాల్సి వస్తేనే ఆరోగ్యశ్రీ పథకం అమలు చేయాలన్నది ట్రస్టు నిబంధన. ఒకవేళ ఆసుపత్రి నుంచి శస్త్రచికిత్స చేసేందుకు అనుమతి కోసం ఆన్‌లైన్ ద్వారా దరఖాస్తు పంపినా ట్రస్టు నుంచి అనుమతి రావడం లేదు. దీంతో పేద ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. కార్పొరేట్ ఆసుపత్రులకు ఆరోగ్యశ్రీ కార్డు తీసుకెళితే ముందుగానే చెల్లుబాటు లేదని జిల్లా ప్రభుత్వాసుపత్రికి వెళ్లండని తిప్పి పంపుతున్నారు. ప్రమాదాలు కాకుండా ఇతర వ్యాధులకు అత్యవసరంగా శస్త్రచికిత్సలు చేయాల్సి వస్తే సొంతంగా ఖర్చు భరించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. అయితే వాస్తవాలను ప్రజలకు వివరించాల్సిన బాధ్యత ప్రభుత్వం, అధికారులపై వుండగా ఆ దిశగా ప్రయత్నించకుండా విభిన్నమైన ప్రకటనలు చేస్తూ ప్రజల్లో అయోమయం సృష్టిస్తున్నారు. జిల్లాలో ఆరోగ్యశ్రీ పథకం ద్వారా వైద్య శిబిరాలు నిర్వహిస్తూ వాస్తవాలు వెల్లడించడం లేదు.

అత్యవసర పరిస్థితుల్లో ఆరోగ్యశ్రీ పథకం ఉపయోగపడుతుందని భరోసాతో వున్న ప్రజలు ప్రభుత్వం తీసుకున్న అనధికార నిర్ణయం కారణంగా ఆవేదన చెందుతున్నారు. నగరంలోని అన్ని కార్పొరేట్ ఆసుపత్రులు ఆరోగ్యశ్రీ పేషెంట్లు లేక వెలవెల బోతున్నాయి. గతంలో ఆరోగ్యశ్రీ జిల్లా కో-ఆర్డినేటర్‌గా వున్న డాక్టర్ జి.సి.నారాయణ కూడా రెండు నెలల క్రితం ఆ పదవి నుంచి తప్పుకోవడం జరిగింది. ఆయన స్థానంలో నియమించిన మరొకరు ఈ పథకం అమలుపై పెద్దగా దృష్టి సారించడం లేదు. అయితే కార్పొరేట్ ఆసుపత్రుల్లో ఆరోగ్యశ్రీ కార్డు చెల్లుబాటు లేకపోయినా ఆరోగ్య మిత్రలను మాత్రం అలాగే కొనసాగిస్తూ వేతనాలు ఎందుకు చెల్లిస్తున్నారో వారికి అర్థం కావడం లేదు.

ప్రస్తుతం జిల్లాలో నెల్లూరు లోక్‌సభ, ఉదయగిరి అసెంబ్లీ నియోజకవర్గాలకు ఈనెల 12న ఉప ఎన్నికలు జరుగనున్నాయి. ఈ ఉప ఎన్నికల ప్రచారంలో కూడా ఆరోగ్యశ్రీ పథకం నిర్వహణపైగాని, కొనసాగింపుపై గాని అధికారపార్టీకి చెందిన అభ్యర్థులు ఎక్కడా లేవనెత్తడం లేదు. కొన్ని గ్రామాల్లో మాత్రం ఆరోగ్యశ్రీ అమలు జరగని విషయంపై నేతలను ప్రశ్నిస్తున్నారు. రాష్ట్రప్రభుత్వం సంక్షేమ పథకాలను తగ్గించాలన్న ఆలోచనతో ఆరోగ్యశ్రీ పథకంపై తొలుత నిషేధం విధించిందన్న ప్రచారం జరుగుతోంది.

# ప్రజల సమస్యలు పట్టని అధికారులు!

ఉప ఎన్నికల పుణ్యమా అంటూ మండల స్థాయి అధికారులు ఎన్నికల విధుల్లో ఉండగా వివిధ సమస్యలపై ప్రజలు కార్యాలయాల చుట్టూ తిరుగుతున్నారు. దీంతో జిల్లాలో పరిపాలన పూర్తిగా స్తంభించిపోయింది.

ఉప ఎన్నికల పుణ్యమా అంటూ మండలస్థాయి అధికారులు ఎన్నికల విధుల్లో వుండగా, వివిధ సమస్యలపై ప్రజలు కార్యాలయాల చుట్టూ తిరుగుతున్నారు. ప్రస్తుతం జిల్లాలో పరిపాలన పూర్తిగా స్తంభించిపోయింది. జూన్ 12న ఉదయగిరి అసెంబ్లీ, నెల్లూరు పార్లమెంటు నియోజకవర్గాలకు ఉప ఎన్నికలు జరుగనున్నాయి. వీటి నిర్వహణకు మండల తహశీల్దార్లు, ఎంపిడిఓలు, ఇతర సిబ్బందిని ఎన్నికల విధుల్లో ప్రభుత్వం నియమించింది. ఎన్నికల షెడ్యూల్ వెలువడిన దగ్గర నుంచి రెండురోజులకోసారి సిబ్బంది అధికారులకు శిక్షణ, అవగాహన కార్యక్రమాలు ఏర్పాటు చేస్తున్నారు. దీంతో ప్రజల సమస్యలు పట్టించుకునే సమయం లేకుండా పోయింది.

జిల్లావ్యాప్తంగా తాగునీటికోసం ప్రజలు నానా అగచాట్లు పడుతుండగా, మరొకప్రక్క సంక్షేమ పథకాలు మంజూరు కోసం లబ్ధిదారులు ఆయా శాఖల కార్యాలయాల చుట్టూ దరఖాస్తులు పట్టుకొని ప్రదక్షిణలు చేస్తున్నారు. తాగునీటి సరఫరా కోసం ఎన్నికల కోడ్ అమల్లో వుందని అధికారులు చెబుతూ సమస్య నుంచి తప్పించుకుంటున్నారు. అయితే ఎన్నికల కమిషన్ అనుమతితో తాగునీటికి ఇబ్బంది లేకుండా అవసరమైన చర్యలు తీసుకోవచ్చున్న విషయాన్ని సంబంధిత శాఖ అధికారులు పూర్తిగా మరచిపోయినట్లు కనిపిస్తుంది. నెలరోజులపాటు ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ తిరగవద్దని ఎన్నికల ఫలితాలు వెలువడిన తర్వాత కార్యాలయానికి రమ్మని క్రిందిస్థాయి సిబ్బంది చెబుతున్నారు.

ఉప ఎన్నికల్లో పోటీ చేస్తున్న ప్రధాన రాజకీయ పార్టీల అభ్యర్థుల తరపున గ్రామాల్లో ఎన్నికల ప్రచారం నిర్వహిస్తున్న వీరి అనుచరులు కొంతమేర తాగునీటి సరఫరా చేయిస్తున్నారు. ఉప ఎన్నికల్లో తమ పార్టీ అభ్యర్థికే తప్పక ఓటు వేయాలన్న హామీ తీసుకుని ట్యాంకర్ల ద్వారా తాగునీటిని పంపుతున్నారు. తాగునీటి కోసం కటకటలాడుతున్న సమయంలో ఉప ఎన్నికలు రావడం, రాజకీయ పార్టీల అభ్యర్థులు నీటిని సరఫరా చేసేందుకు ముందుకు రావడంపై గ్రామీణప్రాంత ప్రజలు అభినందిస్తున్నారు. అధికారులు చేయాల్సిన పనులను రాజకీయ పార్టీల అభ్యర్థుల అనుచరుల చేత చేయించుకోవాల్సి రావడంపై ప్రభుత్వ పనితీరు ఎలా వుందో అర్థం చేసుకోవచ్చు.

కొన్ని మండలాల్లో మాత్రమే జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం క్రింద పనులు జరుగుతున్నాయి. కొన్ని మండలాల్లో రెండోపంట పనిలో రైతులు నిమగ్నమై వున్నారు. మండలస్థాయి అధికారుల పర్యవేక్షణ లేక ఉపాధిహామీ పనుల్లో అక్రమాలు చోటుచేసుకొంటున్నాయన్న ఆరోపణలున్నాయి. వీటిని తనిఖీ చేయాల్సిన ఎమ్పీడిఓలు ఎన్నికల నిర్వహణకు సంబంధించిన కార్యక్రమాల్లో వుంటున్నారు. అధికార పార్టీ నేతలతోపాటు ప్రతిపక్ష పార్టీ నేతలు, అధికారయంత్రాంగం మొత్తం ఉప ఎన్నికల ఏర్పాట్లలో బిజీగా వున్నారు. దీంతో ప్రజల సమస్యల గురించి ఎవరు పట్టించుకుంటారన్నది ప్రశ్న. జిల్లాలో ఉప ఎన్నికల సందడి వేడెక్కింది. అధికారులు మాత్రం వారానికోసారి సమీక్షా సమావేశం ఏర్పాటుచేసి స్వయం సహాయక సంఘాలకు వడ్డీలేని రుణాలు, తాగునీటి ఎద్దడిని నివారణకు అన్ని చర్యలు తీసుకోవాలని ప్రకటించడం విశేషం.

● ముస్లింలను

# రిజర్వేషన్ల పేరుతో మోసగిస్తున్నారు!



విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న హాజీ అబ్దుల్ అజీజ్.

సరైన గణాంకాలు లేకుండా ఉత్తరప్రదేశ్‌లో ఎన్నికల ముందు హడావుడిగా ముస్లింలను మభ్య పెట్టడానికి ఓట్ల కోసం కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం చేసిన మోసపూరిత రాజకీయాలను ముస్లిం సమాజం గమనిస్తూనే ఉందని, వీరి కపట రాజకీయాలను ఇక సహించబోమని వైకాపా మైనార్టీ నాయకుడు హాజీ అబ్దుల్ అజీజ్ హెచ్చరించారు. ఇతర వెనుకబడిన తరగతులకు 27 శాతం రిజర్వేషన్లలో మైనార్టీలకు ఉపకోటా కింద 4.5 శాతం రిజర్వేషన్లు కల్పిస్తూ కేంద్ర ప్రభుత్వం జారీచేసిన ఆదేశాలను కోర్టు కొట్టివేస్తూ గత నెల 28వ తేదీ తీర్పు ఇచ్చిన నేపథ్యంలో 29వ తేదీ హరనాథపురంలోని హాజీ అబ్దుల్ అజీజ్ ట్రస్ట్‌లో ముస్లిం న్యాయవాదులు, మత పెద్దలతో ఏర్పాటుచేసిన సమావేశంలో అబ్దుల్ అజీజ్ ప్రసంగించారు. ముస్లింలకు ఓబిసి కోటాలో రిజర్వేషన్లు కల్పించే సమయంలో తగిన ఆధారాలతో సరైన కారణాలు చూపకుండా జాతీయ వెనుకబడిన తరగతుల కమిషన్‌ను సంప్రదించకుండా రిజర్వేషన్లు కల్పిస్తూ కేంద్ర ప్రభుత్వం మెమోరాండం విడుదల చేయడాన్ని అబ్దుల్ అజీజ్ తప్పుపట్టారు. జస్టిస్ సచార్ కమిటీ ప్రస్తుత గణాంకాల ఆధారంగా రిజర్వేషన్లు పరిశీలించాలని సూచించారు కానీ ప్రభుత్వం ఎటువంటి అధ్యయనం జరపకుండా ఉన్న ఆధారాలను చూపకుండా పాలకులు తీసుకొంటున్న నిర్ణయాలు వారికి ముస్లింల పట్ల ఎంత చిత్తశుద్ధి ఉందో అర్థమయ్యేలా చేస్తుందన్నారు. సమావేశంలో అబ్దుల్ జలీల్, న్యాయవాదులు షఫీ, లతీఫ్, మౌలానా అజీజ్, న్యామతుల్లా, నవాబ్‌జాన్, గయాజ్, అబ్బు, ఇస్మాయిల్, ఫణి తదితరులు పాల్గొన్నారు.

## ఎన్నికలకు కేంద్ర బలగాలు!



నెల్లూరులో దిగిన సిఆర్‌పిఎఫ్ జవాన్లు.

ఉప ఎన్నికల్లో బందోబస్తు నిర్వహించేందుకు కేంద్ర పారామిలటరీ బలగాలు జిల్లాకు చేరుకొంటున్నాయి. ఈ ఎన్నికలలో ఎలాంటి అవాంఛనీయ సంఘటనలు జరగకుండా చూసేందుకు అధికారులు కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లు చేస్తున్నారు. దీనిలో భాగంగా జిల్లా కేంద్రానికి కేంద్ర బలగాలు చేరుకొంటున్నాయి. మొత్తం 35 కంపెనీలను ఈ ఎన్నికలలో బందోబస్తు కోసం వినియోగించుకొంటున్నారు. మూడువేల మంది సిబ్బంది జిల్లాకు రానున్నట్లు సమాచారం. గుజరాత్ స్టేట్ ఆర్మ్‌డ్ ఫోర్స్, సిఆర్‌పిఎఫ్‌కు చెందిన 22 కంపెనీలు రాగా వివిధ ప్రాంతాలకు వీటిని కేటాయించారు. త్వరలో బిఎస్‌ఎఫ్, ఇండో టిబెటన్ సరిహద్దు బలగాలు జిల్లాకు రానున్నట్లు అధికారులు చెప్పారు. వీరందరికీ నగరంలోని కస్తూరిదేవి విద్యాలయం, భక్తవత్సలనగర్‌లోని కెఎన్‌ఆర్ఎం స్కూలు, ప్రభుత్వ పాలిటెక్నిక్ కళాశాలల్లో వసతి ఏర్పాటు చేశారు. మొత్తం బలగాలు జిల్లాకు రావడాన్ని ప్రజలు చర్చించుకొంటున్నారు.

## ఓటరుకు గుర్తింపు తప్పనిసరి!

ఈ నెల 12వ తేదీ జరుగనున్న నెల్లూరు పార్లమెంటు, ఉదయగిరి అసెంబ్లీ నియోజకవర్గాల ఉప ఎన్నికలలో ఓటు హక్కు వినియోగం కోసం ఓటరు గుర్తింపు కార్డు తప్పనిసరిగా కలిగి ఉండాలని జిల్లా కలెక్టర్ స్పష్టం చేశారు. గోల్డెన్ జూబ్లీ హాలులో 1వ తేదీ నిర్వహించిన విలేకర్ల సమావేశంలో ఆయన మాట్లాడారు. మే నెల 29 నుంచి నగరంలోని అన్ని డివిజన్లలో ఓటరు స్లిప్పుల పంపిణీ జరుగుతోందన్నారు. ఓటర్ల వివరాలు తెలిపేందుకు పది పోలింగ్ కేంద్రాలు, పది మొబైల్ కౌంటర్లు ఈ నెల ఒకటి నుంచి 10 తేదీ వరకు పనిచేస్తాయని వివరించారు. 5వ తేదీలోగా పోస్టల్ బ్యాలెట్ కోసం దరఖాస్తు చేసుకోవాలని తెలిపారు. వీరికి 8వ తేది ఓటు హక్కు వినియోగించుకొనేందుకు అవకాశం ఉంటుందన్నారు. 15న కౌంటింగ్ కోసం అన్ని ఏర్పాట్లు చేసినట్లు కలెక్టర్ చెప్పారు.

# జగన్‌వైపు సానుభూతి పవనం!

వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ అధినేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని సిబిఐ అరెస్టు చేయడంతో ప్రజల్లో ఆయన పట్ల సానుభూతి అనూహ్యంగా పెరిగింది. దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్న సమయంలో రాష్ట్రంలో ప్రవేశపెట్టిన అనేక సంక్షేమ పథకాలకు ప్రజల్లో ఆయన పట్ల ఎనలేని ఆదరణ లభించింది. ముఖ్యంగా ఆరోగ్యశ్రీ పథకం వైఎస్‌కు చిరస్థాయి కీర్తిని ఆర్జించి పెట్టింది. అనారోగ్యానికి గురై ఆస్పత్రికి చికిత్స చేయించుకొనే స్థోమత లేక వివిధ రకాల జబ్బులతో జనం బాధపడాల్సి వచ్చేది. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మదిలో మెదిలిన ఆలోచన ఆరోగ్యశ్రీగా రూపుదిద్దుకొంది. పేదలు సైతం తమకు కల్గిన అనారోగ్యానికి కార్పొరేట్ వైద్యశాలలో వైద్యం ఉచితంగా చేయించుకోనేలా ఈ పథకాన్ని రూపొందించడం ప్రజల గుండెల్లో వైఎస్ గూడుకట్టుకొనేలా చేసింది. వేలాది మంది ఆరోగ్యశ్రీ పుణ్యమా అని గుండె ఆపరేషన్లు చేయించుకొని ఆరోగ్యవంతులయ్యారు. అన్ని పార్టీల కార్యకర్తలు వైఎస్ పథకాల వల్ల లబ్ధిపొంది వున్నారు. ఆ అభిమానం జగన్ పట్ల సానుభూతిగా మారింది. జగన్‌పై సిబిఐ కేసులు, అరెస్టు ఘటనలు, ఆయన తల్లి విజయమ్మ మాట్లాడిన తీరు మరింత సానుభూతి పెరిగేలా చేసింది. దీని ప్రభావం ఉప ఎన్నికలపై అధికంగా వుంటుందని పరిశీలకుల అభిప్రాయం.



నెల్లూరు రోడ్‌షోలో రాజమోహన్‌రెడ్డితో రాజన్నభవన్ నేతలు.



పూలజల్లులు కురిపిస్తూ తమ వాడలకు రాజమోహన్‌రెడ్డిని స్వాగతిస్తున్న దృశ్యం.

## వైఎస్ ప్రతిష్ట మంటగలిపే కుట్ర!

రాష్ట్రంలో జగన్‌కు ప్రజల్లో వున్న ఆదరణ చూసి తట్టుకోలేని కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు కుమ్మక్కై దివంగత మాజీ ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రతిష్ట మంటగలిపే కుట్ర చేస్తున్నాయని నెల్లూరు పార్లమెంటు కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి మేకపాటి రాజమోహన్‌రెడ్డి అన్నారు. రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ ఆదేశాలతో తెలుగుదేశంపార్టీ సహకారంతో వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని అక్రమంగా అరెస్టు చేశారన్నారు. అయితే వారు జగన్‌ను జైల్లో మాత్రమే పెట్టగలిగారు గాని ప్రజల హృదయాలలో నుంచి తొలగించడం ఎవరి వల్ల కాదన్నారు.

రాష్ట్రంలో అడుగంటిన కాంగ్రెస్ ప్రతిష్టను పునరుద్ధరించి తన పాదయాత్రతో ఆ పార్టీ రెండుసార్లు అధికారంలోకి తెచ్చిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కుటుంబాన్ని తీవ్ర అవమానాలపాలు చేస్తోందన్నారు. దీన్ని ప్రజలు జీర్ణించుకోలేక పోతున్నారని కాంగ్రెస్‌పార్టీకి సమాధి కడతారన్నారు. ఇతర పార్టీల నుంచి వైఎస్‌ఆర్‌సిపిలోకి వలసలు మొదలయ్యాయని ఇదే ఒరవడి కొనసాగితే 2013కు రాష్ట్రంలో మధ్యంతర ఎన్నికలు తప్పవన్నారు. ఇచ్చిన మాట కోసం జగన్మోహన్‌రెడ్డి ఎన్నో కష్టాలు భరిస్తున్నాడని అన్నారు. మాటతప్పని, మడమ తిప్పని నేత జగన్ అని, ఆయన చరిష్మాను ఎదుర్కోలేక వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కుటుంబాన్ని అవమానాలకు గురిచేస్తున్న కాంగ్రెస్ పార్టీకి, దానికి సహకరిస్తున్న తెలుగుదేశం పార్టీలకు తగిన బుద్ధి చెప్పాలన్నారు. తనను గెలిపించినట్లయితే జిల్లాను సర్వతోముఖాభివృద్ధి చేస్తానని హామీ ఇచ్చారు. రాష్ట్రంలో వైఎస్‌ఆర్ చేపట్టిన ప్రజాసంక్షేమ పథకాలు అమలు కావాలన్నా; స్వర్ణయుగం రావాలన్నా జగన్‌ను ముఖ్యమంత్రి పీఠంపై కూర్చోబెట్టాలన్నారు. అందుకోసం ఫ్యాను గుర్తుపై ఓటు వేసి వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థులను గెలిపించాలని కోరారు.

## కేసుల ఊబిలో ఆశల సమాధి

మొదటి పేజీ కొరవ

తర్వాత వారి మాటలకు విశ్వసనీయత పెరిగింది. లక్ష్మీనారాయణ అంటే అవినీతిపరుల గుండెల్లో జ్వరం కాస్తున్నది. ఆయన పని తీరు చూసిన వారికి జగన్ కేసుల ముగింపు ఎట్లా వుంటుందో అర్థమై పోతున్నది.

ఎన్నికల సమయంలో అరెస్టు చేశారు కాబట్టి, రాజకీయ వేధింపు అనే కోణంలో న్యాయ స్థానాల నుంచి ఉపశమనం పొంది, వెంటనే జైలు నుంచి బయటకు వచ్చేస్తానని ఆశించాడు జగన్. ఆయన కుటుంబ సభ్యులు కూడా అదే ఆశలో వుండినారు. కానీ హైకోర్టు వారికి ఆశాభంగం కల్గించింది. దానితో దీర్ఘకాల న్యాయ పోరాటానికి సిద్ధం కాక తప్పడం లేదు. దీర్ఘకాలం అంటే ఎంత? ఎవరూ చెప్పలేని విషయం ఇది. జగన్ ఇరుక్కొన్న కేసులు ఒకటీ రెండూ కావు. వాటిలో ఎన్నో చట్టపరమైన కోణాలున్నాయి. అవినీతితో పాటు మనీ ల్యాండరింగ్ వుంది. విదేశీ మారక ద్రవ్య చట్టం ఉల్లంఘన వుంది. ఇవి రెండూ కఠినమైన శిక్షలకు ఆస్కారం కల్గినవి. వాటిని సిబిఐ నిరూపించగల్గితే జగన్ జైలు నుంచి ఇప్పట్లో బయటపడక పోవచ్చు. మధు కోడా వలె కొన్ని సంవత్సరాల పాటు జైలులోనే మ్రగ్గవలసి రావచ్చు. అదేజరిగితే ఆయన రాజకీయ ఆశల మాటేమిటి? ఆయన పెట్టుకొన్న పార్టీ భవిష్యత్తేమిటి? ఆయన తల్లి, చెల్లి దాన్ని ఎంతకాలం కాపాడగలరు? ఉప ఎన్నికలలో గెలుపు ఓటములతో ముగిసిపోయే సమస్య కాదిది. ఆ తర్వాత 2014 ఎన్నికల వరకు నిలవాలి. ఈ లోగా ప్రభుత్వాన్ని పడగొట్టాలనే ప్రయత్నం చురుకుగా నడుస్తున్నది. ఎమ్మెల్యేలు పార్టీ మారితేనే అది జరుగుతుంది. పార్టీ మారాలంటే మొదటి ఎర వచ్చే ఎన్నికలలో గెలుపు ధీమా. రెండవది ఇప్పటికిప్పుడు ఫిరాయింపుకు పరిహారం. గాలి బెయిల్ ఉదంతం తర్వాత ఏ ఎమ్మెల్యే కూడా టెలిఫోన్‌లో రాయబారాలు, బేరాలు జరిపే పరిస్థితి లేదు. ఏ గోడకు సిబిఐ లక్ష్మీనారాయణ చెవులాడించి వుంటాడోనన్న భయం జగన్ శిబిరం మొత్తాన్ని కలవరపరుస్తున్నది.

ఈ సమయంలో జగన్ బయటవుండి వుంటే, కిరణ్‌కుమార్‌రెడ్డి సర్కారు చాలా ప్రమాదంలో పడేది. ఉప ఎన్నికలలో మెజార్టీ స్థానాలలో కాంగ్రెస్ పరాజయం ఖాయమని అర్థమై పోతున్నది కాబట్టి, ఫలితాల తర్వాత చాలా మంది ఎమ్మెల్యేలే గోడ దూకడానికి సిద్ధపడుతుండినారు. కానీ ఇప్పుడు వారిని సమన్వయ పరచేవారు లేరు. నిర్ణయం తీసుకొనే వారు లేరు. ఎమ్మెల్యేలు పార్టీ మారాలంటే, వారికి రేపటి ఎన్నికలలో టిక్కెట్ గ్యారంటీ ఇవ్వాలి. ఇప్పటికే ఆ నియోజకవర్గంలో వున్న వైఎస్ఆర్ కాంగ్రెస్ నేతలకు నచ్చచెప్పనిదే అది జరగదు. ఆ హామీ ఎవరు ఇవ్వగలరు? పైగా జగన్ 2014 ఎన్నికల నాటి వరకు బయటపడక పోవచ్చునన్న వాదన ఒకటి వుంది. అదే నిజమైతే ఆ ఎన్నికలలో గెలిపించేదెవరు? డబ్బు దస్కం సమకూర్చేదెవరు? జగన్ బయట వుంటే ఎన్ని వేల కోట్లయినా పోగు చేయగలడు. ఆయన లేకుండా ఎవరిస్తారు చందాలు?

మరోకప్రక్క జగన్ ఆస్తుల స్వాధీన ప్రక్రియ ఒకటి ముందుకు వస్తున్నది. ఇప్పటివరకు సిబిఐ చేసింది కేవలం జప్తు మాత్రమే. కానీ విదేశీ మారక ద్రవ్య చట్టం, మనీ ల్యాండరింగ్ చట్టాలలో దర్యాప్తు మొదలైతే న్యాయస్థానాలు నేరుగా ఆస్తులను స్వాధీనం చేసుకొంటాయి. అది జరిగితే సాక్షి పత్రిక మనుగడ కష్టం. దానికి ప్రతిగా రాష్ట్రమంతా వేల సంఖ్యలో వున్న జగన్ అభిమానుల నుంచి పెట్టుబడులు సేకరించి, 500 కోట్ల మేరకు నిధి సమకూర్చుకోవాలని విజయసాయి రెడ్డి ఒక ప్రయత్నం మొదలు పెట్టాడు. వైట్ మనీ రూపంలో వచ్చే ఆ పెట్టుబడులను న్యాయస్థానాలు ఆపలేవు. కానీ అందుకు సెక్యూరిటీ ఎక్స్ఛేంజ్ బ్యూరో ఆఫ్ ఇండియా నుంచి అనుమతి కావాలి. ఇన్ని కేసులలో చిక్కుకొన్న కంపెనీ కొత్తగా పెట్టుబడులు సేకరించేందుకు సెబీ అనుమతిస్తుందా అన్నది అనుమానమే. సాక్షి పత్రిక ప్రచురణ ఆగకుండా, టీవీ ప్రసారం నిలవకుండా ఆపుకోగల్గితే జగన్ కొంత వరకు తన రాజకీయ భవిష్యత్తును పదిలపరుచుకోగల్గుతాడు. అందుకోసం విజయసాయిరెడ్డి న్యాయ నిపుణులతో తీవ్రస్థాయి చర్చలు జరుపుతున్నాడు. ఏమి చేసైనా ఈ రెండు సంస్థలను కాపాడుకోవాలన్నది వారి తాపత్రయం.

హైదరాబాదులో సిబిఐ ప్రత్యేక కోర్టులు ఒకటికి మూడున్నాయి. వాటిలో పెద్దగా కేసులు పెండింగ్‌లో లేవు. అందువల్ల జగన్ మీద పెట్టిన కేసులు త్వరితగతిన విచారణ జరిగే అవకాశం వుంది. ఒకవేళ ఏ ఒక్క కేసులోనైనా విచారణ రానున్న రెండేళ్లలో పూర్తయి, ఏ కారణం చేతనైనా ఆయనకు రెండేళ్లకు మించిన శిక్ష పడితే ఎన్నికలలో పోటీ చేయడానికి అర్హత కోల్పోతాడు. అప్పుడు పార్టీ పరిస్థితి ఏమిటి?

ప్రస్తుతానికి జనం కాంగ్రెస్ పార్టీ మీద, ప్రభుత్వం మీద విపరీతమైన కసి, కోపం పెంచుకొని వున్నారు. అందువల్ల జగన్‌ను ఆదరిస్తున్నారు. ఆ సానుభూతి, ఆ సమర్థన, ఆ ఆదరణ ఎల్లకాలం వుంటాయని చెప్పలేము. జనం జ్ఞాపకశక్తి చాలా స్వల్పం. అభిప్రాయాలు మార్చుకోవడం వారికి అలవాటు. తనకు అవకాశం దొరికే వరకు జనంలో తన పట్ల ఆదరణ నిలుపుకోవడం జగన్‌కు వీలయ్యే పనేనా? ఆయన శక్తియుక్తులు ఎంతకాలం పని చేస్తాయి? ఇవన్నీ ప్రశ్నలే. అందువల్లనే జగన్ అరెస్టు రోజు ఆయన పక్క చేరడానికి దాదాపు ఇరవై మంది ఎమ్మెల్యేలు సిద్ధపడితే, బెయిల్ నిరాకరించిన రోజుకి ఆ సంఖ్య మూడుకు పరిమితమైంది. జగన్ కేసుల భవిష్యత్తు మీద ఒక స్పష్టత వచ్చే వరకు ఏ ఎమ్మెల్యే కూడా సాహసించి ప్రభుత్వాన్ని పడగొట్టే ప్రయత్నం చేయడని దాని అర్థం.

### రాజీకి 'నో'!

ఇదిట్లా వుంటే జగన్ అరెస్టుకు ఒకరోజు ముందు ఢిల్లీ నుంచి ఒక సందేశం వచ్చిందని వినికిడి. వైఎస్.రాజశేఖర్‌రెడ్డితో సన్నిహితంగా మెలిగిన దిగ్విజయ్‌సింగ్ తరపున ఒక దూత జగన్ కుటుంబ సభ్యులను కలిసి, ఈ దశలోనైనా జగన్ సర్దుబాటుకు సిద్ధపడితే సహాయం చేస్తామని ప్రతిపాదించారట. కానీ సిబిఐ విచారణ ముగించుకొని, ఇంటికి చేరిన జగన్ అందుకు ససేమిరా అన్నాడట. దానితో దిగ్విజయ్‌సింగ్ దూత నిరాశతో వెనక్కు వెళ్లిపోయాడు.





పదవ తరగతి పరీక్షా ఫలితాలలో రాష్ట్రస్థాయిలో మంచి మార్కులు సాధించిన నెల్లూరు శ్రీ సాయి విద్యానికేతన్ విద్యార్థులను అభినందిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి. ప్రక్కన స్కూల్ కరస్పాండెంట్ పద్మావతి చౌదరి.

## జనవాణి

2వ పేజీ కొరవ

షన్లు ఇస్తున్నట్లు రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. ఈ నిర్ణయం చెల్లదని హైకోర్టు తాజాగా తీర్పునిచ్చింది. ఈ రిజర్వేషన్ కల్పించిన తీరులోనే లొసుగులున్నాయి. ముస్లింలపై కాంగ్రెస్‌ది కపట ప్రేమని ఎప్పటికి తెలుసుకొంటారో?

షేక్ తాజుద్దీన్ నెల్లూరు

## వైకాపా నేతల అరెస్ట్ దారుణం

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు జగన్మోహన్‌రెడ్డి అరెస్ట్‌ను నిరసిస్తూ నెల్లూరులో ధర్నా చేస్తుండిన ఆ పార్టీ నేతలను పోలీసులు అన్యాయంగా అరెస్ట్ చేశారు. దీనిమూలంగానే మరుసటిరోజు జరిగిన బంద్ అంత వాడివేడిగా జరుగలేదు. నాయకులను అరెస్ట్ చేసినంత మాత్రాన జగన్మోహన్‌రెడ్డి పార్టీకి ఓట్లు వేయడాన్ని ఎవరూ ఆపలేరు.

డి.జయరామ్ నెల్లూరు

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### జగన్ అక్రమాస్థిలో మేకపాటికి వాటా

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు జగన్ మోహన్‌రెడ్డి అక్రమాస్థిలో మేకపాటి రాజమోహన్ రెడ్డికి వాటా ఉందని టిడిపి జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఆరోపించారు. ఉపఎన్నికల ప్రచారంలో భాగంగా బుజబుజ నెల్లూరులో జరిగిన రోడ్‌షోలో ఆయన మేకపాటి సోదరులపై విమర్శలు చేశారు. వారు కేవలం తమ రాజకీయ లబ్దికోసమే రాజీనామాలు చేశారన్నారు. రాష్ట్రంలో పాలన గాడి తప్పిందని, వైఎస్ఆర్ కాంగ్రెస్, కాంగ్రెస్ పార్టీల అభ్యర్థులు డబ్బుతో ఓట్లు కొనుగోలు చేసేందుకు ప్రయత్నిస్తున్నారన్నారు. తెలుగుదేశం పార్టీ అభ్యర్థి వంటేరు వేణుగోపాల్‌రెడ్డిని గెలిపించాలని కోరారు.

### వెంగమాంబ బ్రహ్మోత్సవాలు

దుత్తలూరు మండలం నర్రవాడలో వెలసిన వెంగమాంబ పేరంటాలు బ్రహ్మోత్సవాలు ఈ నెల 10వ తేదీ నుంచి 14వ తేదీ వరకు జరుగుతాయి. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని కావలి ఆర్డీఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి అధ్యక్షతన జరిగిన సమావేశంలో కార్యనిర్వహణాధికారి రవీంద్రరెడ్డి మాట్లాడుతూ భక్తులకు తాగునీటి సమస్య, విద్యుత్ కోతలు లేకుండా చూస్తామన్నారు. మహిళలకు తాత్కాలిక స్నానపు గదులు, మరుగుదొడ్లు కూడా ఏర్పాటు చేస్తామన్నారు. వెంగమాంబ భక్తులను ఈ ఉత్సవాలకు తరలి రమ్మంటున్నారు కార్యనిర్వహణాధికారి.

### అభ్యర్థుల ప్రచారాలపై నిఘా

వివిధ పార్టీల అభ్యర్థుల ఎన్నికల ప్రచారాలపై గట్టి నిఘా ఉంచాలని, అన్నింటినీ రికార్డు చేయాలని ఎన్నికల వ్యయ పరిశీలకుడు సంజీవ్ కుమార్ యాదవ్ ఆదేశించారు. ఎన్నికలపై ఆయన వివిధ స్థాయిల అధికారులతో గోల్డెన్ జూబ్లీహాలులో సమావేశం నిర్వహించి పలు సూచనలు చేశారు. అభ్యర్థుల రోడ్‌షోలు, ర్యాలీలు, సమావేశాలతో పాటు, పార్టీ కార్యాలయలపైనా దృష్టిసారించి అన్నింటిని వీడియో తీయించాలన్నారు. వాహనాలు, డ్రైవర్ల జీతభత్యాలపైనా తనిఖీలు నిర్వహించాలన్నారు. పార్టీల వివరాలను పూర్తిస్థాయిలో నివేదించాలన్నారు.

### అభివృద్ధి నిరోధకులు ఆనం సోదరులు!

నెల్లూరు నగరాన్ని అభివృద్ధి చెందకుండా ఆనం సోదరులే అడ్డుకొన్నారని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి మేకపాటి రాజమోహన్‌రెడ్డి ఆరోపించారు. 2వ తేదీ విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ దేశంలో అన్ని నగరాలతోపాటు నెల్లూరులోనూ అభివృద్ధి జరిగితే మేయర్ పులిమి శైలజకు పేరొస్తుందన్న కుట్రతో నిధులు రాకుండా అడ్డుకొన్నారన్నారు. తాము అవినీతికి పాల్పడినట్లు కాంగ్రెస్, టిడిపిలు ఆరోపిస్తున్నాయని దీనిపై బహిరంగ చర్చకు రావాలని సవాల్ విసిరారు. తాను ఖచ్చితంగా విజయం సాధించనున్నానని రాజమోహన్ రెడ్డి ధీమా వ్యక్తం చేశారు.

### కాంగ్రెస్‌కు కాబోయే సారథి చిరంజీవి

రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి రాబోయే రోజుల్లో చిరంజీవి నాయకత్వం వహిస్తాడని రూరల్ శాసన సభ్యుడు ఆనం వివేకానందరెడ్డి తెలిపారు. కాపునేతలతో జరిగిన సమావేశంలో ఆయన మాట్లాడుతూ కాంగ్రెస్ పార్టీలోనే కాపులకు సముచిత స్థానం దక్కుతుందన్నారు. చిరంజీవి జాతీయ నాయకుడు అవుతాడని జోస్యం చెప్పారు.

## పదరంగం -18

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | | | | 4 | |
| | | | | | | | | | | |
| | 7 | | | 8 | | 9 | | 10 | | |
| 11 | | | | | | | | | | 12 |
| | | | 13 | | 14 | | | 15 | | |
| | | 16 | | | | | 17 | | | |
| | 18 | | | | 19 | | | | 20 | |
| 21 | | | | | | 22 | | 23 | | |
| 24 | | 25 | 26 | | 27 | | 28 | | | |
| | | 29 | | | | | | | 30 | |
| | | | | | 31 | | | | | |

**అడ్డం**

1. గట్టివాడు (4)
2. పేరు పొందిన, కాపు రస్తుడు (2)
6. దేవేరి (2)
7. దిగజారడం (4)
9. ఉత్తరాంధ్రలోని పుణ్య క్షేత్రం (4)
11. చెట్టు (3)
13. అన్నీ ఒక చోటే, కాంప్లెక్స్ (4)
15. మబ్బు కమ్మేసింది (3)
16. బొక్కెన, బాల్చీ (2)
17. కత్తితో పాటిది (2)
18. గాలి (3)
19. వరస మారిన దిగులు (3)
20. ఇంగ్లీషు పాళీ (2)
21. కాలువ (2)
23. నీళ్ల కుండి (2)
24. పై లోకాలకు వెళ్లిన... (4)
29. వీధి, సందు (2)
30. సువాసన పూలు (2)
31. చుట్టూ ఉన్న ప్రాంతాలు (5)

**నిలువు**

1. క్యూబ్, గొప్ప (2)
2. కుళ్లుబోతుతనం (4)
3. వర్షం (2)
4. ప్రాంతము (ఆంధ్ర) (3)
5. అన్నపూర్ణ ఊరు (2)
7. పదిహేను రోజులు (3)
8. సంతోషము (3)
9. గుండె (3)
10. వెంట్రుకలు (4)
12. వర్షాన్నిచ్చే మేఘం (4)
13. ఇల్లు (3)
14. జ్ఞాతి (3)
16. శక్తి (2)
17. మరక (2)
18. టీనేజ్ (3)
20. సత్యాసత్యాలు (5)
21. ధర్మ మీమాంస (4)
22. క్రింద నుంచి చేనులు (2)
25. ఆకాశం (3)
26. తల్లిని పిలవండి (2)
27. గుమ్మం (3)
28. తేనె సొనల మధుర ఫలం (3)

### సమాధానాలు

## పదరంగం -17

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 పా | రి | 2 తో | షి | కం | | 3 పాం | డ | వు | లు | |
| ర్థి | | య | | | 4 ఊ | చ | | | | 5 డ్రై |
| వ | | 6 ము | క్కం | టి | | 7 జ | టా | 8 యు | వు | |
| 9 శ | 10 తం | | | | 11 అ | న్యం | | వ | | 12 డే |
| 13 రీ | తి | రి | 14 వా | జు | | | 15 ప | త | నం | |
| రం | | | న | | 16 ర | జి | తం | | | 17 బూన్ |
| | 18 వా | | 19 ప్ర | యో | క్త | | 20 గి | 21 ల | 22 క | |
| | 23 స | మ | స్తం | | 24 సి | రా | | 25 లా | రి | |
| 26 భా | వి | | | | క్తం | | 27 వా | టం | | 28 వి |
| ర | | 29 పా | | 30 గా | | 31 మ | ణి | | 32 నా | నో |
| 33 తి | రో | గ | మ | నం | | 34 రా | జ్యం | | 35 నా | దం |

# సంక్షిప్త సింహపురి

## విజయమ్మ కన్నీటిలో కొట్టుకపోతాయి!

వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మరణానంతరం ఆ కుటుంబాన్ని వేధింపులకు గురిచేస్తూ జగన్‌ను జైలుకు పంపిన కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు వైఎస్ విజయమ్మ కన్నీటిలో కొట్టుకపోతాయని నగర మాజీ మేయర్ పులిమి శైలజ, వైకాపా జిల్లా మహిళా కన్వీనర్ అనిత ధ్వజమెత్తారు. నెల్లూరులోని మేకపాటి గెస్ట్‌హౌస్‌లో విలేకరులతో మాట్లాడుతూ తొమ్మిది నెలలపాటు కొనసాగుతున్న సిబిఐ విచారణలో ఏం కొంప మునిగిపోయిందని జగన్‌ను అరెస్ట్ చేయాల్సి వచ్చిందన్నారు. కేవలం ఉప ఎన్నికలను దృష్టిలో వుంచుకొని కాంగ్రెస్, టిడిపిలు కుట్రతోనే జగన్‌ను అరెస్ట్ చేశారని ఆరోపించారు. ఉప ఎన్నికల ప్రచారంలో భాగంగా జిల్లాకు త్వరలో రానున్న విజయమ్మకు వైఎస్‌ఆర్‌సి మహిళా విభాగం తరపున అండగా వుండి ఉదయగిరి అసెంబ్లీ, నెల్లూరు పార్లమెంటు నియోజకవర్గాలలో తమ అభ్యర్థులు అత్యధిక మెజార్టీతో గెలిచేలా కృషి చేస్తామన్నారు. సమావేశంలో మాజీ కార్పొరేటర్ రజనీ, షంషాద్ తదితరులు పాల్గొన్నారు.

## 144 సెక్షన్ ఏమిటి?

జిల్లాలో ఉప ఎన్నికల నేపథ్యంలో ఎన్నికల కమిషన్ నిబంధనలకు వ్యతిరేకంగా అధికారులు 144 సెక్షన్‌ను కొనసాగిస్తామనడం దారుణమని, ఈ విషయమై అవసరమైతే న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తామని మాజీ డిఐజి, ప్రస్తుతం వైకాపా నాయకుడు కారుపోతల బాలకొండయ్య తెలిపారు. నెల్లూరులో విలేకర్లతో మాట్లాడుతూ సరైన కారణాలు లేకుండానే జిల్లాలో 144 సెక్షన్ విధించడంలో ఆంతర్యమేమిటని ఆయన ప్రశ్నించారు. జిల్లాలో ఎక్కడైనా ఘర్షణలు జరిగి అవి కొనసాగుతాయనే విషయాన్ని గుర్తించి స్థానిక సర్కిల్ ఇన్స్‌పెక్టర్ మండల తహశీల్దార్ దృష్టికి ఈ విషయాన్ని తీసుకవెళ్తే అందుకు సంబంధిత తహశీల్దార్ 144 సెక్షన్‌కు ఆదేశాలు జారీ చేస్తారన్నారు. అయితే జిల్లాలో ఘర్షణలు జరిగిన పోబిడి లేకుండా ఈ సెక్షన్ కొనసాగింపు చట్ట విరుద్ధమని బాలకొండయ్య స్పష్టం చేశారు.

## వంటావార్పు

తమ జీవనోపాధితో కొంతమేర అక్కరకొస్తున్న మధ్యాహ్న భోజన ఏజన్సీ ప్రక్రియను జిల్లా అధికార యంత్రాంగం కొల్లగొడుతుండడం బాధాకరమంటూ మహిళలు ఆందోళనలు చేశారు. 29వతేది కలెక్టరేట్ ఎదుట వంటావార్పు చేపట్టారు. తమ నుంచి మధ్యాహ్నభోజనాన్ని ఇస్కాన్ సంస్థకు బదలాయించే ప్రయత్నాన్ని నిరసిస్తూ, ఉదయం నుంచి కలక్టరేట్ ఎదుటే ఆందోళన చేశారు. అక్కడే వంటావార్పు చేయడంతో సహా రాత్రికి కలక్టరేట్ ముందు నిద్రించారు. తాము వండివారిస్తే తల్లిప్రేమ వుంటుందన్నారు. ఇస్కాన్ అందజేస్తే అది ప్రసాదం తప్ప తల్లిప్రేమ కరవవుతుందన్నారు. ఈమెలిక ఏమిటో?

## తెలుగుదేశంను వీడిందిందుకే!

### అభిమానులకు కొమ్మి వివరణ

తెలుగుదేశంపార్టీ అభివృద్ధికి ఎంతోకృషి చేసిన తనకు ఆ పార్టీలో ఎన్నో అవమానాలు ఎదురయ్యాయని, ఆత్మభిమానాన్ని దెబ్బతీయడంతో ఆ పార్టీకి రాజీనామా చేయాల్సి వచ్చిందని ఆత్మకూరు మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడు తెలిపారు. టిడిపి అధినేత చంద్రబాబునాయుడు తనను చిన్నచూపు చూసినా దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మాత్రం స్ట్రాంగ్ ఎమ్మెల్యేగా గుర్తించి కితాబివ్వడం అదృష్టంగా భావిస్తున్నానన్నారు. చేజర్ల మండలం పుల్లనీళ్లపల్లిలో భారీగా తరలి వచ్చిన అనుచరులు, అభిమానుల మధ్య తన రాజకీయ భవిష్యత్తును, తన సుదీర్ఘ రాజకీయ ప్రస్థానాన్ని వివరించారు. 1994లో తెలుగుదేశం వ్యవస్థాపకుడు ఎన్‌టి రామారావు ఆహ్వానం మేరకు టిడిపిలో చేరానన్నారు. ఆ మహానుభావుడు తనపై పెట్టుకొన్న నమ్మకాన్ని వమ్ము చేయకుండా పార్టీ అభివృద్ధికి ఎంతగానో కృషి చేశానన్నారు. జన్మభూమి కార్యక్రమంలో భాగంగా ఆత్మకూరు ప్రాంతంలో చేపట్టిన అభివృద్ధికిగాను రాష్ట్రస్థాయి గుర్తింపు, రాష్ట్రపతి అవార్డు పొందానన్నారు. రాష్ట్రంలో మారుతున్న సమీకరణలో భాగంగా వైఎస్‌ఆర్‌సిపి నేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డి పిలుపు మేరకు ఆపార్టీలో చేరాల్సివచ్చిందని వివరించారు. ఈ సందర్భంగా పలువురు కొమ్మికి తమ సంఘీభావం తెలియజేశారు.

## జైలు జీవితం జగన్‌ను కష్టపెట్టదు!

సికింద్రాబాద్‌లోని చంచలగూడ జైలులో రిమాండ్ ఖైదీగా వున్న వైకాపా అధినేత జగన్మోహన్‌రెడ్డిని నెల్లూరులో ఆ పార్టీ తరపున పార్లమెంట్‌కు పోటీ చేస్తున్న మేకపాటి రాజమోహన్‌రెడ్డి కలసి మాట్లాడారు. నెల్లూరులో జరుగుతున్న ఎన్నికల ప్రచారం, తాజా ఎన్నికల పరిస్థితులను వివరించిన ఆయన బయటకు వచ్చి విలేకరులతో మాట్లాడారు. గత రెండేళ్లుగా కాంగ్రెస్ అధిష్టానం, రాష్ట్రప్రభుత్వం పెట్టిన ఇబ్బందులకంటే జైలు జీవితం జగన్‌ను పెద్దగా కష్టపెట్టదని వాఖ్యానించడం చర్చనీయాంశమయ్యింది.

## నాటక సమాజమది!



ప్రజల సొమ్మును దోచుకొన్న కేసులో అరెస్ట్ అయిన కడప ఎమ్పీ వైఎస్ జగన్మోహన్‌రెడ్డి అరెస్ట్‌ను సాకుగా చూపి సెంటిమెంట్‌తో ఓట్లు అడగడానికి వస్తున్న వైఎస్ విజయమ్మ మాటలు నమ్మవద్దని సినీనటి వాణిశ్రీ పిలుపునిచ్చారు. కాంగ్రెస్‌పార్టీ తరపున నెల్లూరు పార్లమెంట్ స్థానానికి పోటీ చేస్తున్న తిక్కవరపు సుబ్బరామిరెడ్డికి మద్దతుగా రూరల్ మండలంలోని కాకుపల్లి, మాదరాజు గూడూరు, పెనుబర్తి, వడ్డిపాళెం, పల్లెపాళెం గ్రామాలలో ఆమె ఎన్నికల ప్రచారం నిర్వహించారు. వాణిశ్రీ మాట్లాడుతూ తానింత వరకు ఎవరి తరపునా ప్రచారం చేయలేదని, సుబ్బరామిరెడ్డి మంచి వ్యక్తిని, కళాబంధు కావడంవల్లే ప్రచారం చేస్తున్నానన్నారు. సుబ్బరామిరెడ్డిని గెలిపిస్తే నెల్లూరు సర్వతోముఖాభివృద్ధి చెందుతుందన్నారు.

## టైలరింగ్‌లో ఉచితశిక్షణ!

గ్రామీణాభివృద్ధి, స్వయం ఉపాధిశిక్షణా సంస్థ రూడ్‌సెట్ ఆధ్వర్యంలో నిరుద్యోగ మహిళలకు జూన్ 7 నుండి 21 రోజులపాటు టైలరింగ్‌లో శిక్షణ నిర్వహిస్తామని సంస్థ డైరెక్టర్ జె.ఫల్గుణరావు ఒక ప్రకటనలో తెలిపారు. ప్రకాశం, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు చెందిన 35ఏళ్ల లోపు వయస్సు, 7వతరగతి కనీస విద్యార్హత ఉన్న మహిళలు శిక్షణకు అర్హులన్నారు. శిక్షణాకాలంలో భోజనం, వసతి కల్పిస్తారన్నారు. ఆసక్తిగల మహిళలు డైరెక్టర్, రూడ్‌సెట్, మండల పరిషత్ కాంప్లెక్స్, వేటపాళెం, ప్రకాశం జిల్లా చిరునామాకు వెంటనే దరఖాస్తు చేయమన్నారు.

## కొమరిక విద్యార్థి ప్రతిభ

పదోతరగతి పరీక్షా ఫలితాల్లో ఇందుకూరుపేట మండలం కొమరిక జిల్లాపరిషత్ హైస్కూల్ విద్యార్థి షేక్ బాషా 10పాయింట్లతో ఎ1 గ్రేడ్ సాధించి డివిజన్ స్థాయిలో మొదటిస్థానంలో నిలచాడు. ఈ హైస్కూలు విద్యార్థుల్లో 97శాతం మంది ఉత్తీర్ణత సాధించినట్లు ఉపాధ్యాయ సిబ్బంది చెప్పారు. గతంలో ఎన్నడూ లేని విధంగా పదోతరగతి పరీక్షలు వ్రాసిన విద్యార్థులు సబ్జక్టుల వారీగా అత్యధిక మార్కులు సాధించడం, ఎ1 గ్రేడ్‌లో నిలవడం ఇందుకూరుపేట మండలంలో ప్రాధాన్యత సంతరించుకొంది.

## బుచ్చి కళాసాగర్ నాటకోత్సవాలు

బుచ్చి కళాసాగర్ 27వ నాటకోత్సవాలు జూన్ 6వతేది నుంచి 9వతేదీ వరకు జరుగుతాయని ఆసంస్థ అధ్యక్షుడు దొడ్ల రమణయ్యయాదవ్ తెలిపారు. నాలుగురోజులపాటు నిర్వహించే ఈ పోటీలు జొన్నలగడ్డ సర్వోత్తమరావు – అన్నపూర్ణమ్మల స్మారకార్థంగా జరుగుతున్నట్లు తెలిపారు. గత 26 సంవత్సరాలలో నిర్వహించిన ఈ పోటీలలో ప్రదర్శించిన నాటికలను ఈ పోటీలలో ప్రదర్శించరాదన్నారు. కళాసాగర్ ప్రాథమిక కమిటీ పరిశీలనలో ఎంపిక చేయబడిన నాటికలు మాత్రమే ఈ పోటీలలో ప్రదర్శించేందుకు అర్హత సాధిస్తాయన్నారు. దేశంలోని వివిధ రాష్ట్రాలకు చెందిన తెలుగు సమాజాలు ఇందులో పాల్గొనవచ్చన్నారు. అలాగే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిషేధించిన నాటకాలు ప్రదర్శించరాదన్నారు. ఈ నాటకోత్సవాలలో ప్రదర్శించే ప్రతి నాటికకు 7500/– రూపాయలు అందజేస్తామన్నారు.

# భవిష్యత్తు వైఎస్ఆర్ కాంగ్రెస్‌దే!

- ఎమర్జెన్సీ రోజులను గుర్తుకు తెస్తున్నారు!
- విజయమ్మ ప్రచారానికి అపూర్వ ఆదరణ.
- జగన్మోహన్‌రెడ్డి తిరుగులేని నాయకుడు.
- టిఎస్ఆర్ విశాఖలో ఏమి చేశారు?



నెల్లూరు రోడ్‌షోలో మాట్లాడుతున్న మేకపాటి రాజమోహన్‌రెడ్డి.

భవిష్యత్తు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీదేనని, ఉప ఎన్నికల తర్వాత కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల్లో ఎవ్వరూ మిగలరని రెండూ ఖాళీ అవడం ఖాయం అని నెల్లూరు పార్లమెంటు వైఎస్ఆర్‌సిపి అభ్యర్థి మేకపాటి రాజమోహన్‌రెడ్డి తెలిపారు. జగన్ అరెస్ట్ తదితర అంశాలపై ఆయన మాట్లాడుతూ ఎన్నికలు సమీపిస్తున్న తరుణంలో జగన్మోహన్‌రెడ్డిపై ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరు ఎమర్జెన్సీని తలపిస్తున్నదన్నారు. ఉప ఎన్నికలలో ఓటమి పాలౌతామన్న భయంతో కాంగ్రెస్ ప్రభుత్వం, ఢిల్లీ నేతలు కక్ష సాధింపు చర్యలకు పాల్పడుతున్నారన్నారు. జగన్ను కుట్రలు, కుతంత్రాలతో ఇబ్బందులపాలు చేసి పబ్బంగడుపుకోవాలని చూస్తున్న కాంగ్రెస్ ప్రభుత్వానికి అంతిమ ఘడియలు దాపురించాయన్నారు.

## విజయమ్మ సారథ్యం

జగన్మోహన్‌రెడ్డి స్థానంలో దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి సతీమణి వైఎస్ విజయమ్మ ఎన్నికల సారథ్యం వహిస్తున్నారన్నారు. ఆమె ప్రచారానికి ప్రజల నుంచి అపూర్వ స్పందన లభిస్తోందని, పార్టీలకు అతీతంగా ప్రజలందరూ ఏకమై విజయమ్మకు సాదర స్వాగతం చెప్తున్నారన్నారు. రాష్ట్రప్రభుత్వం ప్రజా వ్యతిరేక తీర్పుతో కుప్పకూలడం ఖాయమన్నారు. కాంగ్రెస్ అధిష్టానం వ్యవహరిస్తున్న తీరుతో విసుగెత్తిన కాంగ్రెస్‌పార్టీ ఎమ్మెల్యేలు, ఎంపిలు, మంత్రులు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలోకి వస్తున్నారని తెలిపారు.

## ఏకైక నాయకుడు

వైఎస్ రాజశేఖర్‌రెడ్డిలేని లోటు తీర్చగలిగే సత్తా వున్న ఏకైక నేత జగన్మోహన్‌రెడ్డేనన్నారు. ఆయన పూర్తిస్థాయి నాయకత్వ లక్షణాలున్న వ్యక్తని; కృషి పట్టుదల, ధైర్యం చూసిన వారికే తెలుస్తుందన్నారు. రెండున్నరేళ్లుగా రాత్రి పగలనక, ఎండనక వాననకా ప్రజల్లోనే తిరగడం ఆయన శక్తి సామర్థ్యాలకు నిదర్శనం అన్నారు.



చిన్నారిని ముద్దాడుతున్న మేకపాటిని చూసి చిరునవ్వులు చిందిస్తున్న కాకాణి.

## వారు స్వార్థపరులు

వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్న కాలంలో ఆయనను కీర్తిస్తూ ఆయన ఆశీస్సులతో పదవులు పొందిన వాళ్లు నేడు స్వార్థంతో తమ పదవులను కాపాడుకొనేందుకు, అధిష్టాన దేవతలను ప్రసన్నం చేసుకొనేందుకు రాజశేఖర్‌రెడ్డి కుటుంబాన్ని నోటికొచ్చినట్లు మాట్లాడడం వారి స్వార్థ రాజకీయాలకు నిదర్శనం అన్నారు. రాజశేఖర్‌రెడ్డి సతీమణి విజయమ్మను సైతం విమర్శించడం వారి వికృతపోకడలకు నిదర్శనం అన్నారు. దీనిని ప్రజలందరూ గమనిస్తున్నారని ఎన్నికలలో బుద్ధి చెప్పడానికి సిద్ధంగా వున్నారన్నారు. తాను రాజీనామా చేయడానికి వైఎస్ పేరు సిబిఐ ఎఫ్ఐఆర్‌లో చేర్చడమే కారణమని పునరుద్ఘాటించారు.

## టిడిపి, కాంగ్రెస్ కుమ్మక్కు!

కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల కుట్రలను ప్రజలు తమ అమూల్యమైన ఓటుతో తిప్పికొట్టాలని పిలుపునిచ్చారు. ఉదయగిరి అసెంబ్లీ ఓటు తెలుగుదేశానికి, నెల్లూరు పార్లమెంటు ఓటు కాంగ్రెస్‌కు వేసేలా ఆ రెండు పార్టీలు ఒప్పందం కుదుర్చుకున్నాయని ఆరోపించారు. ఈ కుతంత్రాలకు చరమగీతం పాడాలని పిలుపునిచ్చారు. తెలుగుదేశంపార్టీ అధినేత చంద్రబాబునాయుడు అవినీతి గురించి మాట్లాడడం సిగ్గుచేటన్నారు. ఆ రెండుపార్టీలు అసత్యపు, విష ప్రచారం చేస్తున్నాయని వీటిని ప్రజలు నమ్మే స్థితిలో లేరన్నారు.

## టిఎస్ఆర్ ఏం అభివృద్ధి చేశారు?

కాంగ్రెస్ అభ్యర్థి తిక్కవరపు సుబ్బరామిరెడ్డి వైజాగ్‌ను అభివృద్ధి చేశానని పదేపదే చెప్తున్నాడని ఆయన ఆ ప్రాంతానికి ఏమి చేశారో చెప్పాలని సవాల్ విసిరారు. సముద్రం నిర్మించాడా, నగరంలో ఇళ్లన్నీ ఆయన కట్టించాడా అని ఎద్దేవా చేశారు. ఆయన ఏకంగా బంగాళాఖాతాన్ని కావలికి తెచ్చేలా నెరవేరని వాగ్దానాలు చేస్తున్నారని విమర్శించారు. తెలుగుదేశం, కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థులు ఓటుకు నోటు ఇచ్చేందుకు ప్రయత్నిస్తున్నారని వారిచ్చింది తీసుకొని ఓటు మాత్రం వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీకి ఫ్యాను గుర్తుపై వేసి తనను అఖండ మెజారిటీతో గెలిపించాలని కోరారు.

## భారీగా వలసలు

వైఎస్ జగన్మోహన్‌రెడ్డి పట్ల, వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ పట్ల రోజు రోజుకు ప్రజల నుంచి అనుహ్య స్పందన వ్యక్తమవుతోంది. తెలుగుదేశం, కాంగ్రెస్‌పార్టీలకు చెందిన నేతలు, కార్యకర్తలు భారీస్థాయిలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో చేరుతుండడం ఆపార్టీ పట్ల వారిలో వున్న నమ్మకాన్ని తెలియజెప్తుంది. కావలి నియోజకవర్గంలో మేకపాటి రాజమోహన్‌రెడ్డి ప్రచారం సందర్భంగా వీరంతా ఆయనకు సంఘీభావం తెలుపుతూ పార్టీలో చేరారు. దగదర్తి, ధర్మవరం, లింగాలపాడు, సున్నపుబట్టీ, దామవరం తదితర గ్రామలకు చెందిన తెలుగుదేశం, కాంగ్రెస్‌పార్టీలకు చెందిన కార్యకర్తలు వైఎస్ఆర్ పార్టీలో చేరారు. వీరందరికి రాజమోహన్‌రెడ్డి, కాకాణి గోవర్ధన్‌రెడ్డి కండువా కప్పి సాదరంగా ఆహ్వానించారు.



మేకపాటి రాజమోహన్‌రెడ్డికి బట్వాడిపాళెంలో మంగళహారతితో స్వాగతం.

## మత్స్యకారులకు మేలు

వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అధికారంలోకి వచ్చి జగన్ ముఖ్యమంత్రి అయితే మత్స్యకారుల కోసం ప్రత్యేక ప్యాకేజిని అమలు చేయనున్నామని ప్రకటించారు. చేపల వేటకు వెళ్లి ప్రమాదావశాత్తు మరణించిన మత్స్యకారుల కుటుంబాలకు ఐదు లక్షల రూపాయలు నష్టపరిహారం ఇవ్వాలన్నది జగన్ నిర్ణయం అన్నారు. ఈ విషయాన్ని తమ పార్టీ మ్యానిఫెస్టోలో వుంచామన్నారు. మత్స్యకారుల సమస్యలు తీరాలి అంటే జగన్ అధికారంలోకి రావడంతోనే సాధ్యమవుతుందన్నారు.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com